# భావాలు - బంగారాలు
# భావోక్తులు



డా॥ వెలిచాల కొండలరావు

Bhavoktulu

*By*

**Dr. KONDAL RAO VELCHALA**

*Published by*
**Vishwanatha Shitya Peetam's**
**SISTER NIVEDITA FOUNDATION PUBLICATIONS**
11-4-654/3, Near Niloufer Hospital, Red Hills, Hyderabad - 500 004.
Phone: 23396358; 9848195959, e-mail : vkrao@sncps.com

First Edition 2013



Rs. 125/-

*Copies can be had from*
All Leading Booksellers in India and from the Foundation

Printed at :

# భావ మౌక్తికాలు

డా॥ వెల్చాల కొండలరావు గారు విలువలు తెలిసిన రచయిత. వారు అనేక రచనలు చేశారు. అనువాదాలు కూడా అందించారు. జయంతి పత్రికను వారు నిర్వహిస్తున్న తీరు అనితర సాధ్యం. సృజనాత్మకత, సమతుల వివేచన వారి సాహితీమూర్తికి ద్వినేత్రాలు. పలితకేశులే కాదు పరిణత మనస్కులు. వారి సాహితీక్షేత్రం సుసంపన్నం, హరితవనం.

ప్రస్తుతం మనముందున్న "భావోక్తులు" ఒక విలక్షణ రచన. వారి మనః క్షేత్రంలో పల్లవించిన భావరత్నాలను గుదిగుచ్చి మనకిచ్చారు. సాధారణంగా ఒక రచయిత గ్రంథంలో కొన్ని మాటలు సూక్తి ప్రాయంగా ఉంటాయి. వాటికోసం వెతుక్కోవాలి ఒక్కోసారి. అయితే కొండలరావుగారి ఈ భావోక్తులు ఇంత రాశిగా ఎలా రూపొందాయో ఆశ్చర్యం వేస్తుంది. అన్ని సూక్తిప్రాయోక్తులే. కొన్ని మనసులో పరిమళించిన మల్లెలు, కొన్ని వనజ్యోత్స్నలు, కొన్ని మెరుపు తీగలు, కొన్ని కశాఘాతాలు, కొన్ని ఉల్కాపాతాలు. ఉద్ధరించాలంటే అహమహమికతో అవి ముందుకు వస్తాయి. కొంచె కటువుగా ఉన్నా వారు చెప్పినట్లు 'ఆధునిక మనిషి బుర్రంతా ఒక కలగూర గంప, మురికి కొంప, ముళ్ల కొంప' అనేది వాస్తవమే కదా.

ఎన్నో భావాలకు పందిరి వేసిన డా॥ వెల్చాల వారికి హార్థికాభివందనాలు.

**– ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**

ఉపాధ్యక్షులు, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

# భావోక్తులు

ఈ పుస్తకానికి నేను "భావోక్తులు" యని నామకరణం చేశాను. అంటే, నా అభిప్రాయంలో భావ ప్రధానమైనవియని. భావ ప్రధానమైనవే కదా మరి సాహిత్యం లాంటివవుతాయి? తక్కినవి, పిచ్చాపాటి, మాటల్లాంటివి, అభిప్రాయల్లాంటివి కదా! వాటిలో ఏదో ఒక అర్థం ఉంటే ఉండవచ్చుకాని అందం మాత్రం ఉండదని నా అభిప్రాయం. అలాంటి అర్థం ఉండి అందం లోపించిన వాటిని భావ ప్రధానమైనవి కావు కనుక భావోక్తులు అని అనడం సబబు కాదేమో.

మరి అలాంటప్పుడు మనం అందం మరియు అర్థం రెండూ ఉన్నవాటిని ఏమందాం? "భావోక్తులు" అంటే, భావం లేనిది ఏముంటుంది యని ప్రశ్నించవచ్చు ప్రశ్నించేవారు. అది నిజమే కాని అర్థం వేరు భావం వేరు కదా మరి. 'అరటి' అంటే అర్థం ఉంది కాని దాని గురించి ఏదో కొంత చెబితేనే కదా ఆ చెప్పింది భావమౌతుంది? ఆ చెప్పేది కూడా కాస్త ఆలోచనాత్మకంగా, అందంగా కూడా ఉంటేనే కదా దానిని మనం "భావోక్తి"యని అనాల్సింది. అలాంటి వాటికి ఒక అస్తిత్వం కల్పించాలని, వాటిని భావోక్తులు అని నామకరణం చేస్తే బాగుంటుందని అభిప్రాయపడి ఆ పనిచేశాను. లోగా "రసోక్తులు"యని కూడా నేనొక పుస్తకానికి నామకరణం చేశాను. ఇవి కూడా భావాలు కలవే కాని, అందమైనవే కాని వాటికి తోడుగా రసప్రధానమైనవి. అంటే, దాదాపు కవితల్లాంటివి, కవిత్వంలా భాసించేవి. కాని భావోక్తులు మాత్రం రసప్రధానమైనవి కాకపోవచ్చు.

అందం మాత్రమే రసం కాదు కదా? అందం ఆనందమైతేనే కదా అది రసమౌతుంది. ఆనందంలో కూడా నానా తీర్ల ఆనందాలుంటాయి కదా! అందుకే కదా ఆ నానాతీర్ల అందాలను నానా తీర్ల రసాలుగా చెప్పారు మన పూర్వీకులు.

విశ్వనాథ సత్యనారాయణ గారు "భావమంటే కాలాన్ని దూరంగా చూడడం" అంటే "భావించడం" అని అన్నారు. భావం అనడానికి భావించడం, ఊహించడం, అంతేకాదు, అర్థవంతంగా, అందంగా భావించడం. విశ్వనాథ వారే "భావం ఒకదానిని ఆశ్రయించి పుట్టును, వస్తువు లేకుండా ఊహ ఉద్భవించదు కదా!" అని కూడా అన్నారు. వారే "భావం సంస్కృతీ సంస్కార జన్యం" అని, "శబ్ద ప్రయోగం భావోద్రేకాన్ని బట్టి ఉంటుంది, భావోద్రేకం మనిషి మానసిక స్థితిని బట్టి" అని కూడా అన్నారు.

కనుకనే, "భావం", "భావోక్తి" యనునవి మామూలుగా అనుకునే, ఉపయోగించే పదాలు మాత్రం కావు, లోతైన పదాలు అని నేనభిప్రాయపడి, వాటి స్థాయి మామూలు మాటల స్థాయి కంటే ఉన్నతమైనది కనుక అలాంటి వాటినన్నిటినీ "భావోక్తులు" అని అనడం సమంజసమని, వాటికి ఒక అస్తిత్వం లాంటిది కల్పించినవారమౌతామని ఆ నామాన్ని ఎన్నుకున్నాను. అలాగే గతంలో రసప్రధానమైన వాక్యాలను "రసోక్తులు" అని అనడం భావ్యమని వాటికి అలాంటి నామాన్ని సూచించడానికి సాహసించాను.

# వికాసం

మనిషి మనిషిగా ఒక సంఖ్య, మానవునిగా ఒక సంస్కారం.

దేశం గురించి తెలియక పోవడం, రేశం గురించి తెలియకపోవడం రెండూ సమానం.

మనిషే మనిషికి క్షేమం, మనిషే మనిషికి క్షామం.

సృజన విలువలను విలువైనవాటిలోకి మార్చడం.

బిగ్గరగా ప్రార్థించడం, బిగ్గరగా చదవడం సమానం.

జీవితంలో అతి వికారమైనది ద్వేషం, అతి వినోదమైనది వేషం.

జీవితంలో కాస్తంత హాస్యమే లేకపోతే జీవితమంతా నైరాశ్యం.

కంటిని స్పందించేది కాయం, హృదయాన్ని స్పందించేది సంస్కారం.

ముడి పదార్థం వడి పదార్థం కావడమే అందం, చైతన్యం.

అందం లక్షణం, అందమైనది కళ, అంద విధానం శాస్త్రం.

క్రియ విశ్వాసం యొక్క పర్యవసానం.

అనుభవంతో నేర్చుకునేది వివేకం, అధ్యయనంతో నేర్చుకునేది జ్ఞానం, విజ్ఞానం, పాండిత్యం.

నవ్యత ముఖ్యమే కాని సవ్యతతో పాటు నవ్యత అంతకన్నా ముఖ్యం, సౌఖ్యం.

సంఘమే మనిషి సారానికి, సార్థానికి భూతద్దం.

జీవం సజీవం కావడమే చైతన్యం.

ఏది అద్భుతమో అదే అందం, ఏది అద్వితీయమో అదే ఆనందం.

కష్టాల్లోకల్లా అతిపెద్ద కష్టం స్వేచ్ఛను కాపాడుకునే కష్టం.

విశ్వాసం లేని భక్తి వింత ఆచారం.

అన్నిగౌరవాలను మించిన గౌరవం ఆత్మ గౌరవం.

ఒక విషయం అర్థం కాకపోవడం అర్థం కాకపోవడం కాదు, దానితో పరిచయం లేకపోవడం.

చూడడం చూడడమే కాదు, పరీక్షించడం పరిశీలించడమే కాదు, పలికించడం, ఉలికించడం.

ఎదగడమంటే జీవితాన్ని అర్థవంతం, సార్థవంతం చేసికోవడం.

సృజన స్థూలాన్ని సూక్ష్మీకరించడం, సవ్యాన్ని నవ్యంగా ప్రతిబింబించడం.

మనిషి ముందొచ్చే మనిషికి సంకేతం.

ఏది చైతన్యమో, ఉజ్జీవమో, సజీవమో అదే రసం.

మతం గతమూ కాదు, వ్రతమూ కాదు,  మానవత్వం.

సామ్యవాదం ఉన్న బీదరికాన్ని పంచుకోవడం కాదు,  లేని పెన్నిధిని పెంచుకోవడం.

సత్యానికి దగ్గరికి రావడం అందం, అందానికి దగ్గరికి రావడం ఆనందం.

తన కొరకు కొట్టుకునేది హృదయం, ఇతరుల కొరకు కొట్టుకునేది సహృదయం.

ఏది చమత్కారమో అదే సృజనకు అసలుసిసలైన కారణం.

నిజమైన నాగరికత దూరాలు దగ్గరకావడం కాదు, దూరస్తులు దగ్గరకావడం.

చూడడం చేయడానికి ఊతం, చెప్పడానికి చేయూతం.

అన్ని మెరుగుదలలకు మానవ వనరుల మెరుగుదలే మూలం, ఆధారం.

సంస్కారం మరేమీకాదు మనిషి మనీషలోకి మారడం.

ఐక్యత చేతులు కలవడం కాదు, చేతలు కలవడం.

కాయం మరేమీకాదు, ఆత్మ ఆకారం దాల్చడం.

మనిషే మనిషికి ప్రమోదం, మనిషే మనిషికి ప్రమాదం.

ఏది సార్వకాలీనమో అదే నవ్యం, అదే సవ్యం.

కరుణలేని హృదయం సుఖరోగి సౌందర్యం.

అనైతికత అత్యాశ పర్యవసానం.

న్యాయం నయంగా స్వయంగా బ్రతకడం.

విద్యే ప్రతి పరిమాణానికి తూకం, ప్రతి పరివర్తనకి ప్రమాణం.

అర్థానికి అధ్యయనం, సార్థానికి అనుభవం.

కార్మికునిది పని, కళాకారునిది పనితనం.

కాలమే అన్నిటికన్నా పెద్ద గాలం.

విలువలకు జ్ఞానం, నిలువలకు ప్రపంచజ్ఞానం.

చిత్రం ! మనిషి మనిషిని చంపితే నేరం, జంతువును చంపితే మగతనం.

అర్థవంతమైన అనుభవం అక్షరాలా ఆత్మ సాక్షాత్కారం.

అనుభవం కాదు ముఖ్యం, దాని ప్రభావం.

శరీరానికి స్నానం, హృదయానికి సంస్కారం, మేధకు అధ్యయనం.

ఎంత జ్ఞానం కావలంటే చంపుకోవాలి అంత అహం, పెంచుకోవాలి అంత వినయం, వివేకం.

పనికి పరిహారం, పనితనానికి అదనంగా హారం.

చాలక అడిగేది బిచ్చం, చాలి అడిగేది తుచ్ఛం.

జ్ఞానం విషయ సముదాయం కాదు, విషయ సమన్వయం.

మతం జ్ఞానం కాదు, 'హితం'.

విజయం ఊహ కాదు, పచ్చిగణితం.

వినడం వినడమే కాదు, గుర్తించడం, గౌరవించడం.

యధావిధిగా చేసేది పని, యజ్ఞంగా చేసేది పనితనం.

ఉన్నతి లేకుండా ఉనికికి లేదు అర్థం, సార్థం.

ఇల్లు అద్దం, సంఘం భూతద్దం.

ప్రతిభ రూపంగా అందం, గుణంగా సంస్కారం.

పండితుడు కావడం కాదు ముఖ్యం, పాండిత్యాన్ని పంచుకోవడం.

మతానికి పత్యం కాదు కావలసింది, సత్యం.

విజ్ఞానం జ్ఞానాన్ని జ్ఞానంతో ముడిపెట్టడం.

వాపోవడం లేకపోవడాన్ని ఇనుమడించడం.

ఒకరి గురించి అదే పనిగా ఆడిపోసుకోవడం, వారికి లేని కీర్తి నార్జించి పెట్టడం.

విద్య మగాన్ని మోగన్ని పురుషున్ని పురుషార్థిని చేసే ఆయుధం.

మతాలన్నీ చెప్పేవి ఒకటే, మతిలేక అవుతాం కుహనామతులం.

జ్ఞానానికి పడితే పట్టోచ్చు దశాబ్దం, కాని సంస్కారానికి పడుతుంది శతాబ్దం.

ఆడేది కళ, ఆడించేది శాస్త్రం.

శక్తి అణువు పరమాణువులోకి మారడం.

విద్యంతా అర్థాన్ని అందంగా, అందాన్ని అర్థవంతంగా చెప్పడం.

మూఢత్వం మూఢునికి తాపం, ముందున్న వాని పాలిటి శాపం.

సృజనకు మదింపు కన్నా కుదింపు ముఖ్యం.

విద్య అవసరమే కాదు ఆరోగ్యం.

పాపం నేరం కాదు అజ్ఞానం.

విద్య గతకడం కాదు, వెతకడం, పట్టుకోవడం.

పని ద్వారా క్షేమం, పనితనం ద్వారా సంక్షేమం.

చైతన్యం నిశ్శబ్దం శబ్దం కావడం.

అసహనానికి అపార్థం అసలు కారణం.

మనిషి దేవుని సృష్టే కాదు దేవుని ప్రతిబింబం.

మాట్లాడ రాకపోవడం మరణంతో సమానం.

శిల్పం మరేమీ కాదు శబ్ద ఔచిత్యం.

అద్వైతం అందరిని ఒకరిలో ఒకరిని అందరిలో చూడడం.

కవిత అర్థం కాదు రమణీయార్థం.

"కమ్యూనికేషన్" పద్ధతిగానే కాదు పసందుగా కూడా మాట్లాడగలగడం.

అందాన్ని చూడడం భాగ్యం, అభ్యసించడం అభ్యుదయం.

సహనం సంస్కారంలో సగ భాగం.

కవిత్వం జీవితాన్ని వింతగా, విచిత్రంగా విశ్లేషించడం.

చదవడం చదవడమేకాదు, మారడం, పరివర్తన చెందడం.

కష్టంగా చేసేది పని, ఇష్టంగా చేసేది పనితనం.

సౌందర్యం పదార్థం కాదు, ప్రభావం.

ఏది శుద్ధమో అదే సవ్యం, అదే నవ్యం.

అందం రూపం ద్వారా అద్భుతం, గుణం ద్వారా అద్వితీయం.

స్నేహంగా సేవాభావంగా జీవించడమే ఆధ్యాత్మికం.

విద్య విషయాలు వెదకడం కాదు, వికాసాలు, వివేకాలు వెదకడం.

మొక్క కావడం దీపం, కలుపు మొక్క కావడం శాపం.

శక్తి వ్యక్తికావడం జీవం, వ్యక్తి వ్యక్తిత్వంలోకి మారడం చైతన్యం.

చరిత్రంతా వారసత్వం, ఆశీర్వాదం.

రచన యజ్ఞం, భావం అజ్యం, భాష ఆచారం, అభివ్యక్తి, ప్రయోజనం.

ప్రతిభ అసామాన్యాన్ని సామాన్యాన్నుండి పిండుకోవడం.

విశ్వాసం కప్పుకోవడం కాదు, ఒప్పుకోవడం.

పరిశోధన శోధించడం కాదు, సాధించడం, పట్టుకోవడం.

జీవితం స్వప్నం, జీవించడం యజ్ఞం.

కలిసి చేసేది పని, కలిసి మెలిసి చేసేది పనితనం.

భావానికి శబ్దం, దావానికి నిశ్శబ్దం.

జ్ఞానం బాధను తప్పించే ఉపాయం.

ఏది ఎప్పటికి సవ్యమో అదే ఎప్పటికి నవ్యం.

అభివృద్ధి అదృష్టం నుండి ద్రుష్టంలోకి అడుగు వేయడం.

అర్థానికి శబ్దం, అంతరార్థానికి నిశ్శబ్దం.

ఐక్యత మాటలు కలవడం కాదు, బాటలు కలవడం.

జరిగింది ఇతిహాసం, జరగవలసింది సాహిత్యం.

ప్రతిభ దూరాన్ని దగ్గరగా చూడడం.

జ్ఞానం వివరం కాదు సవివరం.

అహింస హింసించకపోవడం కన్నా ఎక్కువ ద్వేషించకపోవడం.

భాషంతా భావానికి పక్కలు వేయడం, రెక్కలు తొడగడం.

అర్థాలు తెలియడమంటే సారాలు తెలియడం, సార్థాలు తెలియడం.

నివసించే చోటు నిలయం, వికసించే చోటు ఆలయం.

Epigram అంటే ఒక టన్ను అర్థాన్ని ఒక గ్రాము శబ్దాల ద్వారా అందించడం.

విద్య చదవడం కాదు, మార్పు కొరకు నేర్పుతో నేర్చుకోవడం.

జీవితానికి కావాలసింది నిష్కామం కాదు, నిబ్బరమైన కామం.

కన్నీటిని కూడా పన్నీటిలోకి మార్చేది కవిత్వం.

అందం రసం, ఆకర్షణ పాదరసం.

అనుభూతి లేని మనిషి అచ్చమైన భూతం.

ఏది ఖచ్చితమో అది వ్యవసాయం, ఏది కుచ్ఛితమో అది వ్యవహారం.

గొప్ప సౌందర్యం అనుభవం కాదు సాక్షాత్తు దైవదర్శనం.

నిజమైన చూడడం వీక్షించడం కాదు పరీక్షించడం.

ఎంత పదార్థానికి దగ్గరైతే అంత పరమార్థానికి దూరం.

ఏది శ్రేయమో అదే భావ్యం.

విజ్ఞానం వికాసమే కాదు వినోదం.

ఎంత స్వార్థానికి దగ్గరైతే అంత సార్థానికి దూరం.

ఆకృతి సుకృతికావడమే సంస్కారం.

ఇంద్రియాలను స్పందించేది మోహం, అతీంద్రియాలను స్పందించేది రసం.

ఆర్థిక బీదరికం ఆర్థిక బీదరికం కాదు, తరచి చూస్తే పారమార్థిక బీదరికం.

నవ్యతకు గతం మరణం, పురాతనం శాపం.

చెప్పేది చేయడం చేసేది చెప్పడం సత్యం.

నిజాయితీ నీతిగా పరిపాలించడం.

ఏది సామాజిక ఔచిత్యమో అదే సమంజసం, సామ్యవాదం.

కాలమే అన్ని ఔషధాలను మించిన ఔషదం.

రసం జీవభావంకాదు, సజీవ భావం, ఉజ్జీవ భావం.

నిస్వార్థమంటే నిబ్బరమైన స్వార్థం.

అవిద్య అవిద్యే కాదు అనారోగ్యం.

ప్రతి నేరం మొదటి నేరానికి మరో సంపుటం.

ఎన్నిసార్లు మనిషి మనిషిగా జన్మించాలంటే అన్నిసార్లు మనిషి పాటించాలి మానవత్వం.

మతాచారం మతంలో ఒక భాగమే కాని కాదు దాని ఆసాంతం.

మనిషి మనీషిగా మారడమే మంచితనం.

సంస్కృతి ఆదర్శ జీవితాలకు పట్టే అద్దం.

రసం స్థూలం సూక్ష్మం కావడం.

హృదయానికి హృదయమెంత దగ్గరో అంత దూరం.

రసం ఆకారం ఆత్మలోకి మారడం.

విద్య సత్యాన్ని కనుగొనడం, సంక్షేమాన్ని సాధించడం.

నిజమైన పని ప్రేమకు ప్రతి రూపం.

భావానికి మాట, దావానికి మౌనం.

ద్రవ్యం నుండి సవ్యాన్ని పిండుకోవడం దర్శనం.

నిజాయితీ లేకుండా సాధ్యం కాదు నిజం.

జ్ఞానం తెలిసికోవడమే కాదు, తెలిసికోరడం.

రసం జీవం జీవాత్మను స్పృసించడం.

శిల్పం ప్రధానంగా భారసామ్యం, సమతులం.

మనసుకు ధ్యానం, మస్తిష్కానికి జ్ఞానం.

గొప్ప సౌందర్యం కావడం కాదు, అవుతూనే ఉండడం.

విద్య విషయాలను తూర్పాల పట్టడం, జల్లెడ వేయడం.

సత్యానికి దీవించడం కాదు కావాలసింది, జీవించడం.

ధ్యానం జ్ఞానాన్ని మంచి నీటితో చేయించే స్నానం.

సంస్కరించబడింది అధునాతనం, సంస్కరించబడంది పురాతనం.

మనిషి గురించి తెలిపేది జ్ఞానం, మనీష గురించి తెలిపేది ధ్యానం.

మనిషి మనీషకు ముడి పదార్థం.

దైవవాదం దైవవాదంకన్నా ఎక్కువ దైవత్వవాదం.

ఏ గుడీ, ఏ బడీ, తల్లి ఒడితో కాదు సమానం.

నిజమైన చూడడం ఒకరిని అందరిలో, అందరిని ఒకరిలో చూడడం.

ముడికి హాస్యం, విడికి అపహాస్యం.

గుడికి మతం, వడికి శాస్త్రం.

మతానికి మరోపేరు గుణ శాస్త్రం.

పని పని కాదు యజ్ఞం.

రాయిలో కూడా సాయిని చూడడం తాత్త్వికం, దార్శనికం.

సహించడం సంస్కారం, సాధించడం సాహసం.

చిత్రం! ఘడియ ముందరిది ఆధునాతనం, ఘడియ వెనకది పురాతనం.

దావాగ్ని లావాగ్ని కన్నా ప్రమాదం.

దువ్వడానికి నవ్వడం ఉపోద్ఘాతం.

మతం వ్రతం కాదు, కృతం, సుకృతం.

సాహిత్యం విషయాలను వింతగా, హితాన్ని కథగా చెప్పడం.

నాయకత్వం నలుగురు సరేననడం.

గుర్తుకన్నా గుర్తింపు ముఖ్యం.

చదువు వడెవేయడం కాదు, వడెబోయడం.

గుణం లేని గుండె దీపం లేని దేవాలయంతో సమానం.

జ్ఞానం విషయాలు తెలియడం కాదు, విలువలు తెలియడం.

ఎంత దృష్టి సూక్ష్మమయితే అంత సృష్టి సూక్ష్మం.

వికసిస్తే వ్యక్తిత్వం, విజృంభిస్తే శక్తిత్వం.

జీవితం ఉండడం కాదు(not being), కావడం(but becoming).

సాహిత్యం అందమైన మతిబింబం యొక్క అందమైన ప్రతిబింబం.

సత్యం చక్కని విలువ, రాజకీయం చిక్కైన వ్యవహారం.

చర్యలేని జ్ఞానం వ్యర్థం, జ్ఞానం లేని చర్య ప్రమాదకరం.

హింసకన్నా నింద హీనం, అవమానం.

జ్ఞానం ముడిపెట్టడం కాదు, ముడివిప్పడం.

హృదయంలో జనించే ధ్వని ప్రతిధ్వనే కవిత్వం.

ఏకాంతం మనసుతో మమేకం కావడం.

సానుభూతి సగం న్యాయం.

విద్య సమాచారం కాదు, సందేశం.

నిదర్శనం కొరకే ప్రదర్శనం.

రూపం సాక్ష్యం, నైరూపం లక్ష్యం.

సాహిత్యం ముద్దు ముద్దు మాటల్తో ముగ్గులు వేయడం.

పుణ్యం పూజించడం కాదు, పూజకొరకు పూయడం.

క్షేమానికి పని, సంక్షేమానికి పనితనం.

సభ్యత కలది సమాజం, లేనిది సమూహం.

స్వయం సమృద్ధే స్వాతంత్ర్యానికి స్వజాతీయతకు నిదర్శనం.

స్వరాజ్యానికి స్వేచ్ఛ, సురాజ్యానికి త్యాగం.

జ్ఞానం భూతల స్వర్గానికి వేసే సోపానం.

వెంట నడవడం కాదు కావలసింది, వెనువెంట నడవడం.

ఆధ్యాత్మికత మరేమీ కాదు, హృదయం సహృదయం కావడం.

విద్య పట్టా కాదు, పరివర్తనం.

రామాయణం రమణీయం, భాగవతం కమనీయం, భారతం గమనీయం.

మనిషి ఫలం కావడానికి పుట్టించబడిన పుష్పం.

జ్ఞానం వివరం కాదు, సారం.

విలువలకు కళ, వలువలకు శాస్త్రం.

చదవడం వల్లించడం కాదు, వరించడం.

ఈ లోకమంతా ఒక భావం, కనబడేదంతా దాని స్వభావం.

చెట్టును చూడడం సందర్శనం, చెట్టు ద్వారా దాని నిర్మాతను చూడడం దర్శనం.

అతి ధనవంతుడు కావాలంటే ఒకే ఒక మార్గం, పెడమార్గం, ఎడ మార్గం.

పెరగడం ముఖ్యమే కాని, కూడా పెరగడం ముఖ్యమే కాదు సౌఖ్యం.

అర్థాలు తెలియడం విద్య, అంతరార్థాలు తెలియడం వికాసం.

సృజన సామాన్యాన్నుండి అసామాన్యాన్ని పిండుకోవడం.

సాహిత్యం హితాన్ని ఋుతంగా బోధించే సాధనం.

ఆదర్శవాదం ఉన్నదానికన్నా ఉత్తమం సాధించగోరడం.

ఆశావాదం, అంతా మన మంచికేననుకొను దృష్టి దృక్పథం.

నిరాశావాదం అంతా మన చెడుకే ననుకొను నైజం.

ప్రేమతో ఇచ్చేది స్వచ్ఛం, ప్రేమతో కాక ఇచ్చేది బిచ్చం.

ఆధ్యాత్మిక పేదరికం వలననే ఇతర పేదరికం.

ప్రేమ గుణం, సేవ దాని రూపం.

నీవేమయింది కాదు ముఖ్యం, ఎలాగయింది అంత కన్నా ముఖ్యం.

ఇష్టం లేకుండా కష్టం రాణించదు, పైపెచ్చు నష్టం.

అన్ని తెలియడం ముఖ్యమే కాని ఆత్మ తెలియడం అన్నిటికన్నా ముఖ్యం.

ఏది సంస్కరించబడిందో అదే నవ్యం, అదే సవ్యం.

మనిషిని పనిమనిషిగా మార్చడం సులభం, మానవునిగా మార్చడం దుర్లభం.

పరంపర గతం కాదు ప్రస్తుతం కాదు, నిరంతరం.

నిష్కామం కాదు సాధించాల్సింది, నిబ్బరమైన కామం.

విద్యాలయం విద్యాలయం కాదు చికిత్సాలయం, విద్య విద్యకాదు ఔషధం.

ఒక వాక్యంలో చెప్పేది అనుభవం, పది వాక్యాల్లో చెప్పేది పాండిత్యం.

సృజన పాతవి మెరుగుపరచడం, కొత్తవి కనుగొనడం.

కాలమే అన్నిటికన్నా పెద్ద గాలం.

జ్ఞానం వికాసమే కాదు, వినోదం.

బాధను భరించడమే సంస్కారం.

సహనమే అసలు సిసలైన సంస్కారం.

నిరాకృతి ఆకృతికావడమే ఓంకారం.

పాపం నేరం కాదు అజ్ఞానం.

దొంగిలి కన్నా ఎంగిలి నేరమే కాదు, ఘోరం, క్రూరం.

ఎందుకనేది తెలిస్తే ఎలాగనునది సులభం, సరళం.

నేరం వ్యక్తిగతం కన్నా ఎక్కువ వ్యవస్థాగతం, సాంఘికం.

మతం లేని మనిషి కళ్ళెం లేని గుర్రం.

ప్రేమలేని శక్తి పెంకె, శక్తిలేని ప్రేమ పేలవం.

జీవితం యొక్క ధ్యేయం స్వయం సార్థకతను సాధించడం.

క్షేమం లేకుండా లేదు సంక్షేమం, సంక్షేమం లేకుండా లేదు శాంతం, ప్రశాంతం.

మనిషి గొప్పతనం మనిషి మనిషిగా పుట్టడం కాదు, మనిషి మనిషిగా మెట్టడం.

జీవితం కాలం, యవ్వనం దానిలో వసంతం.

నాగరికతకు శాస్త్రం, సంస్కృతికి సంస్కారం.

మనిషే మనిషికి కొలమానం, వెలమానం.

నేరం ఒకరికి బేరమైతే, ఒకరికి భారం.

సృజనంతా స్వేచ్ఛా పర్యవసానం.

హృదయం సహృదయమైతే దేవాలయం.

యోగం రూపం రూపాంతరానికి ప్రయాణించడం.

ప్రయోజనం సారం సార్థకంకావడం.

సజీవం కావడం జీవి వచనం నుండి ప్రవచనంలోకి మారడం.

వికాసం వ్యక్తి వ్యక్తిత్వంలోకి మారడం.

జీవితం యొక్క లక్ష్యం సత్యాన్ని వెదకడం, సౌందర్యాన్ని కనుగొనడం.

జ్ఞానం తెలిసికోవడం ద్వారా కలిసిపోవడం.

గోత్రం కన్నా నేత్రం ముఖ్యం.

జీవికీ జీవికీ భేదం వయస్సు కాదు నిర్ణయించేది, అభ్యుదయం.

శబ్దాన్ని అర్థం కొంతవరకే మోస్తుంది, ఆ పిదప నిశ్శబ్దం.

విద్య పెరగడం ముఖ్యమే కాని విద్య విద్య కావడం అంతకన్నా ముఖ్యం.

అన్నిశబ్దాల్లోకల్లా అతి కఠినమైన శబ్దం నిశ్శబ్దం, అతి కఠినమైన మాట మౌనం.

ఎంత చదివింది కాదు ముఖ్యం, ఏమి, ఎలా, ఎచట చదివింది అంత కన్నా ముఖ్యం.

సర్దుబాటు ఆగిపోవడం కాదు, కాస్తాగి తిరిగి సాగిపోవడం.

చైతన్యం జీవం సజీవం కావడం.

కోపం నిరాశకు, పేరాశకు నిదర్శనం.

నివసించడానికి గృహం, వికసించడానికి విద్యాలయం.

మిత్రుత్వానికి కావాలసింది దాతృత్వం, భాతృత్వం.

నిజమైన చూడడం భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని  చూడడం.

ఎంత పదార్థానికి దగ్గరయితే అంత యధార్థానికి దూరం.

ఏది కొట్టుకొంటుందో అది హృదయం, ఏది చుట్టుకొంటుందో అది సహృదయం.

ముక్కు సూటితనం శ్రేయమే కాని కాదు ప్రేయం.

గతంతో మనమేమీ నేర్చుకోకపోతే గతమే అవుతుంది మనకు వర్తమానం.

హృదయమూ ఒక గుడే కాని, ప్రతీదీ కాదు, సహృదయం.

బుద్ధి అన్నిటికీ సమాధానం చెప్పదు, కొన్నిటికి జ్ఞానం, కొన్నిటికి ధ్యానం.

అర్థానికి అధ్యయనం, అర్థవంతానికి అనుభవం.

ఎవరి విశ్వాసం వారికి విశ్వంతో, అశ్వంతో సమానం.

ఒక యుగాన్ని కదిపేదీ కదిలించేదీ నియమం కాదు, వ్యక్తిత్వం.

మనం వృథా చేసేది ధనం కాదు, ఆయుష్షు, కాలం.

సృష్టించడమంటే పునః మనని మనం సృష్టించుకోవడం.

సాహిత్యం మరేమీ కాదు సువాక్యం.

బీదరికం భారమే కాని బానిసత్వం భారానికే భారం.

విలువల్లోకల్లా అతి విలువైన విలువ సంస్కారం, సహనం.

మనుషుల్లో ఉంటే కానీ మనిషికి తెలియదు మనిషి ప్రయోజనం.

ఆశయంలేని జీవితం అంధకారం, జ్ఞానం లేని జీవితం గుడ్డితనం.

విషయం చెప్పడమంటే విషయం చెప్పడం కాదు, వినయం, వికాసం, వివేకం చెప్పడం.

మంచి విద్యార్థి కావడమంటే, మంచి పౌరుడు, మంచి నిర్వాహకుడు కావడం.

త్యాగం ప్రార్థనకన్నా ఉన్నతమే కాదు ఉత్కృష్టం.

ఏది వివేకమో, వికాసమో అదే ఔన్నత్యానికి ప్రాణం.

మరణాన్ని ఎదుర్కోవడం కష్టమే కాని, జీవితాన్ని ఎదుర్కోవడం అంతకన్నా కష్టం.

సహజతలోనే ఉంటుంది స్రష్ట యొక్క సర్వస్వం.

జీవి యొక్క లక్ష్యం సజీవం, ఉజ్జీవం కావడం.

ఆత్మ దేహం పోగొట్టుకున్న సువాసనను ప్రోగుచేసికునే పుష్పం.

ఈ ప్రపంచంలో అన్నిటికన్నా బాగుండేది అందం, అంతకన్నా బాగుండేది సంస్కారం.

సృజనకు వృద్ధికన్నా శుద్ధి ముఖ్యం.

విద్య మార్గం, వికాసం వాహనం, వివేకం గమ్యం.

శిల్పం సప్రయోజనంగా శబ్దాన్ని వాడడం.

నిజం ముఖ్యమే కాని, నిజమనునది కాదు ఇదిమిద్దం.

ఏది మంత్రమో అది మతం, ఏది తంత్రమో అది రాజకీయం.

జీవితమొక మమకారం, జీవించడమొక చమత్కారం.

జ్ఞానం హృదయానికి ఉదయం.

మిత్రుత్వానికి హాస్యం, శత్రుత్వానికి అపహాస్యం.

వాదం ముదిరితే వివాదం, వివాదం ముదిరితే విరోధం, విరోధం ముదిరితే యుద్ధం, యుద్ధం ముదిరితే రుద్ధం.

చిత్తశుద్ధి లేని సభ్యత నిర్జీవ సౌందర్యం.

ఆట గెలవడం ముఖ్యమే కాని ఆట నియమంగా ఆడడం అంతకన్నా ముఖ్యం.

ఒక దాని మూల్యం తెలియాలంటే, తెలియాలి దాని ప్రయోజనం.

పరిపాలనలకు నియమాలకన్నా నిజాయితీలు ముఖ్యం.

విద్య గ్రంథాలు తెలియడం కాదు, గంథాలు తెలియడం.

సిద్ధాంతం కాదు సిద్ధి ముఖ్యం.

దేహం రథం, బుద్ధి సారధి, మేధ అశ్వం, కాలం సంకేతం.

లక్షణం మంచిది కాకపోతే లక్ష్యమవుతుంది తుచ్ఛం.

ఏమి చేయాలనుటకు జ్ఞానం, ఎలా చేయాలనుటకు నైపుణ్యం.

అమ్మకానికి కావలసింది నమ్మకం, విశ్వాసం.

సర్దుబాటు సహనానికి నిదర్శనం.

విత్తనం మంచిదయితే అవుతుంది వృక్షం, కాకపోతే తుచ్ఛం.

తెలివి ఉన్నదానిని ఉట్టికెక్కించే ఆయుధం.

వాస్తవం సత్యానికి ఉపోద్ఘాతం.

ఒకడిని ఇది మిద్ధంగా నిర్వచించడం, అతడు అంతకన్నా మరింకేమీ కాడని ఇదిమిద్ధంగా నిర్ణయించడం.

అత్యంత అందమైన భాష అత్యంత అర్థవంతమైన మౌనం.

అధికారంలో కాస్తంత కారమే లేకపోతే అవుతుంది అది ఉప్పు కారం లేని ఉపాహారం.

సాహిత్యం విన్నది, కన్నది, కనుగొన్నది ఇంపుగా, సొంపుగా చెప్పడం.

ఏది సభ్యజన ఆమోదమో అదే అవుతుంది నిజం, ధర్మం, న్యాయం.

ఒక దర్శనం పది పట్టాలతో సమానం.

అర్థం, అర్థవంతమైన అనుభవానికి అక్షర రూపం.

ఎంత భావం సూక్ష్మమయితే అంత సున్నితమవుతుంది దాని అభివ్యక్తం.

పదే పదే చేసేది పని, పదునుగా చేసేది పనితనం.

సృజన ప్రయోజనాన్ని ప్రతిష్ఠించడం.

భరించేది సహనం, హరించేది కోపం.

సత్యం వాస్తవానికెప్పటికీ ఆమెడ దూరం.

జ్ఞానం జ్ఞానాన్నుండి జ్ఞానాన్ని ముడివిప్పడం, విజ్ఞానం జ్ఞానాన్ని జ్ఞానంతో ముడిపెట్టడం.

బ్రతుకుకు మానం, బ్రతుకుదెరువుకు ఉద్యోగం.

సహజజీవనం అందం, సహ జీవనం ఆనందం.

కష్టాల్లోకల్లా అతిపెద్ద కష్టం పత్యం చేయడం, సత్యం చెప్పడం.

అసహనానికి అసలు కారణం అహం.

విధించింది శాసనం, విధించుకున్నది ధర్మం.

విజయాల్లోకల్లా అతి గొప్ప విజయం తనపై తాను సాధించుకునే విజయం.

ఆగ్రహానికి అహంభావమే ఆజ్యం.

అజ్ఞానం అజ్ఞానికి రోగం, వెంటున్నవానికి అంటురోగం.



సంస్కృతి చూడడానికి చిన్నది, వాడడానికి పెద్దది.

ఎంతవరకైతే పాఠాలు విలువలుగా చెప్పబడవో అంతవరకు అవుతాయి అవి వట్టి ఊకదంపుడు నిలువలు.

కాలం చైతన్యానికి టీక, పరివర్తనకు ప్రతీక.

భాష వాడితేనే వాడి, లేకపోతే బోడి, మోడి.

దేశాన్ని ప్రేమించడం దేశ మట్టి కొరకు కాదు దేశ గట్టి కొరకు.

భావాలకూ భాషలకూ ఉంటాయి బట్టలకు మల్లే వాటి ఫ్యాషన్లు.

అతిశయోక్తికి కావలసింది యుక్తి కాదు, కుయుక్తి.

పద్ధతిగా మాట్లాడేది శాస్త్రం, పసందుగా మాట్లాడేది కళ.

'నేను' సర్వానికి చెందింది, 'నేనే' గర్వానికి.

కళల్లో, కవితల్లో ముగింపే అరగింపు.

కోపం తాపానికి మరోపేరు.

అందాన్ని పట్టుకోవడం ప్రతిభ, ముట్టుకోవడం ముచ్చట.

కొందరు కళ్ళు లోతులైతే, కొందరివి నూతులు, కొందరివి బూతులు.

హక్కులు జీవికి చెందినవి, చిక్కులు జీవితానికి.

ఎంత మనుషుల విలువలు తరుగుదలైతే అంత వస్తువుల ధరల పెరుగుదల.

పెద్ద దేశాలు చిన్న నేతృత్వాలు పొసగని బాంధవ్యాలు.

మన హృదయాలే మన అసలు సిసలైన చిరునామాలు, వీలునామాలు.

కలం, హలం, గళం బాగుంటే కులాన్ని పట్టించుకోరెవ్వరూ.

స్వేచ్ఛకొరకే నియమాలు, స్వేచ్ఛవలననే అభ్యుదయాలు.

పదార్థాలు పదార్థాలు కావు వాటి నిజార్థాలలో.

పరువు కావాలంటే నెరువు, నెరువు కావాలంటే తెరువు.

రేశమే లేకపోతే దేశానికర్థమే లేదు.

ఎవ్వరూ వేటినీ అవి ఉన్నట్లు చూడరు, వారున్నట్లు చూస్తారు తప్ప.

నదులు నదులు కావు ప్రవహించే మదులు.

గుడి గుడి కావాలంటే బడి బడి కావాలి, ఒడి ఒడి, మడి మడి.

ఎవరికి పరంపరంటే ఏమిటో తెలియదో వారికి పరువంటే ఏమిటో కూడా తెలియదు.

ఏ దేశపు శాని బాగుంటుందో ఆ దేశపు వాణి బాగుంటుంది.

ప్రతి పనీ పవిత్రమే అవుతుంది, సేవించే భావంతో కాక సేవా భావంతో చేస్తే.

విలువలంటే ఏమిటో తెలిస్తే విద్యలన్నీ తెలిసినట్లే.

గొప్ప సంస్కృతులన్నీ గొప్ప మనుషుల నీడలు, జాడలు.

ఈ యుగమంతా పెరుగుదలకన్నా ఎక్కువ పరుగుదలకు, మెరుగుదలకన్నా ఎక్కువ మొరుగుదలకు చెందింది.

ఈ రోజుల్లో మనిషికి మనిషితో ఉన్నంత ప్రమాదం మరి దేనితో లేదు.

భావాలెప్పటికీ పురాతనాలే, భాషలే అధునాతనాలు.

నియమాలు నియమాలు కావు, సానబట్టిన నిజాలు.

కరువు కరువుకు చెందిందే కాదు, పరువుకు కూడా.

అజ్ఞానమున్నంత వరకు అవినీతి తప్పదు, అవినీతి ఉన్నంత వరకు అపవాదు.

పని పనితనమే కాకపోతే వట్టి శ్రమ, పరిశ్రమ.

ప్రగతిని లక్ష్యంతో నిర్ణయించాలి కాని లక్షణంతో కాదు.

ఐక్యతకు బోధన కాదు కావలసింది, సాధన.

బడి బడి కాకపోతే కాదు రాబడి రాబడి.

నీ కన్నే చీకటైతే నీకు అన్నీ చీకటే.

హృదయంలో వెలితుంటే వేళ వేళకాదు, హేలా హల.

చెడు చెడ్డవానికి వ్యాధి, వెంటున్నవానికి అంటువ్యాధి.

బైటి ఐక్యత కావాలంటే కావాలి లోపలి సమైక్యత.

మనిషి, రాబోయే మనిషికి టీక, ప్రతీక.

జీవితానికి చెందిన సిద్ధాంతమేదీ జీవితాన్ని మించదు.

నేర్చుకోవడమంతా తుదకు పోల్చుకొని తేల్చుకోవడం కొరకే.

నిజమైన జ్ఞానం అహాన్ని పెంచదు, పెంచుతుంది దాహాన్ని.

వేదన లేకుండా శోధన శోధన కాదు, పరిశోధన పరిశోధన, సాధన సాధన.

ప్రగతిని విలువలతో కొలవాలి, నిలువలతో కాదు.

జ్ఞానం మోతకాదు, పూత.

జీవికి శ్వాసెలాంటిదో జీవితానికి ఆశ్వాస అలాంటిది.

నాగరికతలు వస్తు సేవా సౌకర్యాలు కావు, సత్సంబంధాలు.

ఉత్పత్తి ఆర్థిక ప్రగతికి సూచిక, విభజన సాంఘిక ప్రగతికి.

నిజమైన చరిత్ర మానవుని చరిత్ర కాదు, మానవతా చరిత్ర.

నవ్యత కాలానికి చెందింది, సవ్యత వాలానికి.

ప్రకృతి సిద్ధంగా ఉండడమే సుకృతి.

నాగరికత సుఖానికి చెందింది, సంస్కారం ఆనందానికి.

సహజ జీవితం అందానికి సూచిక, సహ జీవితం ఆనందానికి.

విద్య వాదనకు చెందింది కాదు, వేదనకు.

మాటే లేకపోతే బాటే లేదు, అంతా చాటే.

మార్పు కావాలంటే నేర్పు, నేర్పు కావాలంటే ఓర్పు.

బయటి సభ్యత కావాలంటే లోపలి పరిశుభ్రత.

సహజమయింది ప్రతీదీ సాదాగానే ఉంటుంది.

వ్యక్తి వికసిస్తేమానవుడు, వికటిస్తే దానవుడు.

విద్యంతా 'వేర్ల'తో మొదలవాలి కాని 'పేర్ల'తో కాదు.

బ్రతుకుకు విలువలు, బ్రతుకు దెరువుకు వలువలు, చలువలు.

స్వాతంత్ర్యం దేశానికి చెందింది, స్వేచ్ఛ రేశానికి.

చదువంతా 'ధ్యానం'తో మొదలవాలి కాని 'జ్ఞానం'తో కాదు.

ప్రతిభ శక్తి, నైపుణ్యత యుక్తి.

చర్య ముఖ్యమే కాని, అంతకన్నా ముఖ్యం పరిచర్య.

బయటి శాంతి కావాలంటే లోపలి ప్రశాంతి.

దర్శన ప్రదర్శనలన్నీ నిదర్శనాల కొరకే.

యువకులు వెనకాడడం బలహీనత. వయస్కులు ముందాడడం హీనత.

ఒకే ఒకసారి తింటే ఎలా సరిపోదో, అలాగే ఒకే ఒక సారి వింటే, కంటే.

ఐక్యతంటే చేతులు కలవడం కాదు నీతులు కలవడం.

ఎన్నిసార్లు మనిషి మనిషిగా పుట్టాలంటే అన్నిసార్లు మనిషి మనిషిగా మెట్టాలి.

భాష భావానికి సరిపోతే సరిపోతుందేమో కాని దావానికి కాదు.

వలువలు కూడా ముఖ్యమే కాని విలువలతోపాటు వలువలు.

జ్ఞానమొక చెలిమె, ఎంత దానిని దోకితే అంత ఊరుతుంది కలిమి.

విద్యకు విద్యాంగం గీటురాయి, విధానం తురాయి, క్రమశిక్షణ ఆకురాయి.

ప్రతీదీ పసందయిందే అవుతుంది, పదే పదే చేస్తే కాదు పదునుగా చేస్తే.

దేశాన్ని ప్రేమించడమంటే దేశాన్ని ప్రేమించడం కాదు, రేశాన్ని ప్రేమించడం.

సంఘానికి విలువలు, సమూహానికి వలువలు.

మేధ ముడిశక్తి, తెలివి వడి శక్తి.

మాట శక్తి, పదం దాని యుక్తి.

మనిషి ఒంటరిగా ఉంటే సాక్షీ, పది మందిలో ఉంటేనే కాకి.

శక్తికి ఆసక్తికి స్పందన, ఆసక్తి అనుభూతికి ప్రేరణ, అనుభూతికి, రుచికి, శుచికి.

శాస్త్రం శక్తికి చెందింది, కళ యుక్తికి, మతం ముక్తికి.

అతి నగరీకత వలసకు దారి, అతి వలస వల్లకాడుకు రహదారి.

కాయాలకు శుభ్రత, కార్యాలయాలకు సభ్యత.

'జెనరేషన్ గ్యాప్' వలువలకు చెందింది కాదు, విలువలకు.

విద్యంతా హృదయంతో మొదలెట్టాలి కాని మేధతో కాదు.

ఎంత నగరీకత హెచ్చితే అంత నాగరీకత తచ్చు.

రాజకీయం దేశం కొరకు, మతం దేశీయత కొరకు.

పద - అర్థాలు తెలిసినవాడు పదానికి పది అర్థాలు చెప్పగలడు.

సుఖవంతానికి నగరీకత, రసవంతానికి నాగరీకత.

ఉన్నతి సరియయిందైతే అదే అవుతుంది అభ్యున్నతి.

విశ్వాసానికి భయం మొదటి మెట్టు, భక్తి తుది మెట్టు.

అన్నీ ఒక్కటే కాని, ఒకటి నుండి మరొకటి.

నైపుణ్యత ప్రతిభకు క్రియ పేరు.

దేశం భూమికి చెందింది, దేశీయత హామీకి.

మంచి సంస్థలన్నీ మంచి నీటి బావులు.

ఎవరు మొదట సుగ్రీవులో వారే అవుతారు తుదకు హైగ్రీవులు.

సజ్జనులు తప్ప జనులెప్పటికీ ధ్వనులే.

వేదాలు పుస్తకాలు కావు, అర్థవంతమైన సార్థవంతమైన అనుభవాలు.

మనిషి ఎంత సాగాదీస్తే అంత చక్కన, ఎంత సానపడితే అంత చిక్కన.

ధనాన్ని ధర్మంతో తూకం వేయాలి, విద్యను వినయంతో, వివేకంతో.

చెట్టును ప్రేమించలేనివాడు మట్టిని కూడా ప్రేమించలేడు, మనిషిని?

అన్ని దారులూ తుదకు దరిదారికి, సరిదారికే.

రంగు రమ్యానికి సూచిక, రాగం గమ్యానికి.

మనమెచట కూర్చునేది మనమెచట నిలుచున్నది నిర్ణయిస్తుంది.

చరిత్రంతా ఒకటే, నాగరికతలు దానిలో మజిలీలు.

పని పనికాదు ప్రార్థన, క్రియ క్రియ కాదు కీర్తన.

నాణ్యత మాన్యతకు దారి, మాన్యత మహోనీయతకు రహదారి.

అతిథులే రాకుంటే అన్ని ఇళ్ళూ గోరీలే.

అంకుశమైనవి శబ్దాలు, నిరంకుశమైనవి నిశ్శబ్దాలు.

ఎందుకనునది తెలిస్తే ఎలాగనునది తేలిక.

స్వేచ్ఛ అవకాశం కొరకు, అవకాశం అభ్యుదయం కొరకు.

జ్ఞానం మోత కాదు పూత.

దైవం కాలంద్వారా వాలాన్ని దాలుస్తాడు.

శాసనమెప్పటికీ మెప్పుగా ఉండాలి కాని రొప్పుగా కాదు.

కొందరు మాట్లాడితే వింత, కొందరు మాట్లాడితే చింత.

ఎంత సుఖాలెక్కువైతే అంతా సుఖరోగాలెక్కువ.

ఏ నేరమూ నేరం కాదు ఒక్క ఏమీ చేయక ఊరకే పడుండే నేరం తప్ప.

నిజమైన నాగరికత సుఖాలకు చెందింది కాదు సంస్కారాలకు.

మనం ఆఖరుకు నేర్చుకునే పాఠాలన్నీ మనం మొదట నేర్చుకోవాలసిన పాఠాలే.

"ఏమీ చేయని చేతులకన్నా ముండ్ల కిరీటాలు చేసే చేతులైనా మిన్న'' అంటారు ఖలీల్ జిబ్రాన్‌గారు.

హృదయం లేని బుద్ధికన్నా బుద్ధిలేని హృదయం మేలు.

మన జీవిత చిత్ర విచిత్రాలకు సామగ్రి సమకూర్చేవి చాలా వరకు మన వెండితెర చిత్రాలే.

మనుషులకు మల్లే పదాలకూ ఉంటాయి వాటి సమయాలూ, సందర్భాలూ.

విజయానికి హృదయాన్ని మొదట జయించాలి.

యుద్ధాలకు అస్త్రలే కావాలని లేదు, అక్షరాలూ చాలు.

మతాన్ని ప్రేమించేది మతం కొరకు కాదు హితం కొరకు.

వృద్ధి పెరుగుదలకు చెందింది, అభివృద్ధి మెరుగుదలకు.

మంచి పుస్తకాల ద్వారా మనకు తెలిసేది మనిషి గురించి కాదు 'మనీష' గురించి.

చెడు ఒక వ్యాధి, అరికట్టకపోతే అవుతుందది అంటువ్యాధి.

కావడానికే కాకపోతే ఇచటికి రావడానికర్థమే లేదు, సారం, సార్థం.

రసం సుక్రోక్తి కన్నా ఎక్కువ వక్రోక్తి.

ఎంత రాబడి ఆశిస్తే అంత లోబడి.

విద్యా సార్థకత దాని వినియోగాన్ని బట్టి ఉంటుంది.

పని కార్మికునికి చెందింది, పనితనం కళాకారునికి.

నిశ్శబ్దం ఋషి భాష, శబ్దం కృషి భాష.

ఎవడైతే ఈనాడు వింటాడో వాడే రేపు వినిపిస్తాడు.

ఎంత ఉన్నతంగా ఎదగాలంటే, అంత ఉన్నతంగా స్వేచ్ఛ గురించి తెలియాలి.

విధించినవి శాసనాలు, విధించుకున్నవి విలువలు.

సంస్కృతిపై పెట్టుబడంతా సంక్షేమంపై పెట్టుబడే.

చదువెప్పటికీ మురుస్తూ చదవాలి కాని అరుస్తూ కాదు.

ఎంత బీదవారైతే అంత భరించరానిదవుతుంది నాగరీకత.

వ్యవహారంలో శాసనానికన్నా నమ్మకానిదే ఎప్పటికీ పై చేయి.

మాటే రాకపోతే అంతటా మోహమాటే, నగుబాటే.

లక్షణాలన్నీ లక్ష్యాల పరిచయాలే.

పని ద్వారా ప్రగతి, ప్రగతి ద్వారా పని.

మనిషి ముదిరితే మానవుడు, మానవుడు ముదిరితే ఋషి.

ఎన్నికలెప్పటికీ మన్నికలపై ఆధారపడి ఉంటాయి.

ఒక దేశానికి వాతావరణమెలాంటిదో ఒక జాతికి సంస్కృతీ సంస్కారాలలాంటివి.

ఏకాంతం ధ్యానానికి చెందింది, ఏకాకితనం ప్రమాదానికి.

శబ్దాలకు రుచి అభిరుచులే కావు శుచులు కూడా ఉంటాయి.

పుస్తకమూ ఒక తోటే, చదివితే మురిపాల మూటే.

జీవితంలో మనిషి చేబట్టే ప్రతి చర్యా మనిషి తనకుతాను చేసుకునే సంస్కరణే.

కాలమనునది అందరికి ఒక్కటే కాదు, ఒక్కొక్కరికి ఒక్కొక్కటి.

నీ హృదయమే ఉదయమయితే పదాలు రాలవు దానినుండి రాలుతాయి ప్రసూనాలు.

శబ్దాలు శబ్దాలు కావు, ఆత్మలు, పరమాత్మలు.

కాలం గురించి తెలిసినవాడే గాలం గురించి, మూలం గురించి కూడా తెలిసినవాడవుతాడు.

ఎంత విస్తృతంగా అధ్యయనం చేసింది కాదు ముఖ్యం, ఎంత లోతుగా.

జీవితాలన్నీ ఆరాటాలే, ఆరాటాల కొరకు చేసే పోరాటాలే.

ఏ మనిషికైతే గతముంటుందో ఆ మనిషికే వర్తమానమూ, భవిష్యత్తూ ఉంటుంది.

జ్ఞానానికి ధ్యానం ఉద్యానవనం.

కార్మికుడు కావడానికి కాదు విద్యాభ్యాసం, కళాకారుడు కావడానికి.

ఈ ప్రపంచమంతా ఒక అందాల జవ్వని, ఎంత చూచినా తరగని ఆమని.

జీవితంలో కాస్తంతా హాస్యమే లేకపోతే జీవితమంతా అపహాస్యమే.

అనుభూతి లేని మనిషి అచ్చంగా భూతం.

ఎన్ని అర్థాలు నీకు తెలియాలంటే , కావాలి నీకు అన్ని అర్థవంతమైన, సార్థవంతమైన అనుభవాలు.

ధనం ధనం కొరకు కాదు, ఘనం కొరకు.

నీవు సత్యాన్ని రక్షించు, అది ధర్మాన్ని రక్షిస్తుంది.

ప్రతిదీ ఆటే కాని ఆడిస్తుంది.

చిత్రానికీ మాటుంటుంది, వింటే, వినాలని ఉంటే.

మంచి బోధకుడు ఒక నిషి, పుస్తకం అతని చేతిలో ఒక మిష అంటారు I.V. చలపతిరావుగారు హమేషా.

భాషలు వాడితే అవుతాయి అవి మాటలు, భావాలు వాడితే అవుతాయి అవి బాటలు.

అవినీతి డబ్బుకన్నా ఎక్కువ జబ్బుకు చెందింది.

మతానికి కావలసింది మత మార్పిడి కాదు, మత నడవడి.

యుక్తిలేని శక్తి అశక్తే.

నీవొక చిత్రాన్ని దేవునిగా భావించి పూజిస్తే పూజించుకాని, దేవున్నే చిత్రంగా భావించి పూజించకు.

విద్యాలయాలు నెలకొల్పబడేవి నేర్చుకోవడం కొరకు కాదు, త్వరగా, త్వరత్వరగా నేర్చుకోవడం కొరకు.

రాళ్ళు రాళ్ళు కావు, మూగబోయిన ఆత్మలు, పరమాత్మలు.

పాటించేవాడే అవుతాడు తుదకు పాలకుడు.

మతాలకు కావలసింది పత్యాలు కావు, సత్యాలు.

విద్యంతా ఆలోచనతో మొదలవాలి కాని అధ్యయనంతో కాదు.

కృషి పెరగాలంటే శుచి, శుచి పెరగలాంటే రుచి, రుచి పెరగాలంటే అభిరుచి.

విద్య పనికొరకు కాదు పనితనం కొరకు.

ఆచరించేవాడే అవుతాడు నిజమైన ఆచార్యుడు.

జీవులు సజీవులు కావడానికి చేసే ప్రయత్నాలే ఉద్యమాలు.

మనిషి పదార్థానికి సూచిక, మానవుడు యధార్థానికి.

ఏ రాగ పరాగ సరాగమూ లేక జీవించడం విరాగంతో సమానం.

వృద్ధి రూపుకు చెందింది, అభివృద్ధి ఊపుకు, అభ్యున్నతికి చూపుకు.

విలువలే పాటిస్తే ఇళ్ళన్నీ కలవలే.

మాట బాగుంటే అదే తెస్తుంది మూట, సాపాట.

ఎంత రాపిడెక్కువైతే అంత దోపిడెక్కువ, చేయి సాపిడి.

సత్యమెప్పుడూ జరదగా ఉంటుంది కాని సరదాగా ఉండదు.

అందం పురోభివృద్ధికి సూచిక, వికారం తిరోభివృద్ధికి.

విద్య వృత్తినే కాదు ప్రవృత్తిని కూడా మారుస్తుంది.

నిజం లేకుండా ఏ ఇజమూ రాణించదు.

“ఏ కుటుంబమైతే కలిసి మెలిసి తింటుందో, ఆ కుటుంబమే కలిసిమెలిసి కూడా ఉంటుందంటుంది ఒక సూక్తి.

నీవెవరినైనా ప్రభావితం చేయాలంటే మాటలతో మాట్లాడకు, మాట్లాడు కళ్ళతో.

నీ అనుమతి లేకుండా నిన్నెవ్వరూ చిన్న చూపు చూడ లేరు.

ఎవరైతే కేవలం వారి కొరకే వంట చేసుకుంటారో, వారి కన్నా పచ్చి దొంగలు మరొకరుండరు.

జీవితానికి నిష్కామం కాదు కావలసింది నిబ్బరమైన కామం, నిరాపేక్షకాదు కావలసింది, నిబ్బరమైన ఆపేక్ష.

ప్రతి తిరుగుబాటూ అరుగుబాటుపై నిరసనే.

పని క్షేమానికి సూచిక, పనితనం సంక్షేమానికి.

హృదయమూ ఒక గుడే, చదవగలిగితే ఒక బడే, విన గలిగితే ఆచార్యుడే.

పుస్తకాలలో కొన్ని పుస్తకాలు కనువిప్పేవైతే కొన్ని కనుకప్పేవి.

మాటలే పుష్పాలు, పున్నమలు, మాటలే పలుగు రాళ్ళు, పల్లేరు కాయలు.

స్వాతంత్ర్యం దేశానికి చెందింది, దేశీయత రేశానికి.

అనుభూతులు వికృతం కాని సుకృతాలు, ఆలోచనల సులోచనలు.

చదువుకూడా ఆడగల్గితే ఆటే, పాడగల్గితే పాటే.

ఎవడైతే స్పష్టంగా చూడగలడో వాడే స్పష్టంగా చెప్పగలడు, చేయగలడు.

విభేధించడం పురోగతి, విరోధించడం తిరోగతి.

కొన్ని పుస్తకాలు సభ్య పరిచేవయితే, కొన్ని మభ్య పరిచేవి, కొన్ని లభ్యపరిచేవి.

జ్ఞానం తెల్లన, అజ్ఞానం దానిపై కప్పబడిన నల్లన.

భాషెప్పుడూ భావానికి అనువాదం లాంటిదవుతుంది కాని అసలు లాంటిది కాదు.

ఒక దేశపు వయస్కులు ఆదేశంలోనే అవుతారు కొన్నాళ్ళకు విదేశీయుల్లాంటివారు.

నవీనత అమెరికీయతా కాదు, జపానీయతా కాదు, యూరోపీయతా కాదు, మౌలికత, సార్వత్రికత, సార్వకాలీనత.

అందం మంచిదైతే నీరెండ, కాకపోతే ఎండ.

నీ క్రింది వానినెప్పటికీ చులకనగా చూడకు, నీకు గూడా ఉంటారు నీ పైవారు.

స్వదేశ భావన మరేమీ కాదు, స్వశక్తి, స్వయం పోషక భావన.

మతానికి కావలసింది భజన కాదు, సృజన.

ఏ బడైనా, గుడైనా, మాతృ ఒడిని మించదు.

విద్య జ్ఞానానికి చెందింది, వినయం సంస్కారానికి.

ఒక పనిని అందంగానే చేయలేకపోతే ఆడుక్కుతినడం మేలంటారు జిబ్రాన్ గారు.

ఎవరికి సురాజ్యం గురించి తెలియదో, వారికి స్వరాజ్యం గురించి కూడా తెలియదు.

తరచి చూస్తే ఏదీనేరం కాదు ఒక్క ఒకరికి భారమయే నేరం తప్ప.

మన విద్యంతా మన సంస్కృతికి ప్రతిబింబం కావాలి కాని మరొక సంస్కృతికి కాదు.

చెడ్డవానికన్నా పిల్లవాడు మేలు, మూఢుని కన్నా నాస్తికుడు.

భూమికి కూడా బాధలుంటాయి, దాని నెరదలనడగండి అవే చెబుతాయి.

మనుషులకు వలెనే సంస్కృతులకు, సాంప్రదాయాలకు కూడా ఉంటాయి వాటి బలహీనతలు.

ఎలాగైతే ఒక తోట ఎన్నో పూల చెట్లున్నంత మాత్రాన్నే పలు తోటలు కాదో అలాగే ఒక దేశం ఎన్నో భాషలు, ప్రాంతాలు, మతాలున్నంత మాత్రాన్నే పలు దేశాలు కాదు.

ప్రతిభ అనుభవాన్ని ఆమెడ దూరం నుండి పసికట్టే శక్తి, యుక్తి.

నీవొక భావాన్ని అరువు తెచ్చుకుంటే తెచ్చుకోవచ్చు కాని, దాని స్వభావాన్ని, సంస్కృతిని అరువు తెచ్చుకోలేవు.

మనకు మన అతీతమైన సందేశాలెప్పుడూ మన ఆత్మ నుండే వస్తాయి.

ఏ కాలపు విజయాలను ఆ కాలపు ఆయుధాలతో జయించాలి కాని మరో కాలపు ఆయుధాలతో కాదు.

ఎవరు వారి కష్టాల గురించి అదే పనిగా చెబుతారో వారు దుర్బలులు, ఎవరు చెప్పరో వారు హృద్బలులు.

నను నీవు ఈ రోజు కొల్లగొడితే నిన్నూ ఎపుడో ఒకపుడు కాలం కొల్లగొడుతుంది గుర్తుంచుకో.

అన్ని బోధనలూ తుదకు హృదయాలను సహృదయాలలోకి మార్చడం కొరకే.

ఎటునుండి పోవలసింది ఎచటికి, ఎందుకు పోయేదానిపై ఆధారపడి ఉంటుందంటుంది, అలైస్, అలైస్ ఇన్ వండర్‌లాండ్‌లో.

మతం మనిషిని మార్చదు, మనిషే మతాన్ని మారుస్తాడు.

ప్రతి యోధుని వెనకాల పదిసార్లు పడి లేచిన మనిషుంటాడట.

కలిసి చేస్తే పని, కలిసిమెలిసి చేస్తే పనితోపాటు money, so many.

ఎంత సిద్ధికావాలంటే, కావాలి అంత శుద్ధి, బుద్ధి.

ధనాన్ని నీతి నిజాయితీతో కొలవాలి. ఘనాన్ని నిర్మాణంతో, నిర్వహణతో.

విద్య భుక్తికి చెందింది, వికాసం శక్తికి, వివేకం ముక్తికి.

నదులు నదులనుకుంటున్నారా మీరు, కావు ప్రవహించే మదులు.

అన్నిటికన్నా అతి కష్టమయింది ప్రేమ, అందుకేనేమో దానికి దానిపై అంత ధీమా.

జ్ఞానం చూచి నేర్చుకునేది, సంస్కారం తూచి, వేచి, కాచి.

నిజమైన కళ కలలాంటిది, అందుకే దానికి అంత వెల.

అవినీతి డబ్బుకన్నా ఎక్కువ మానసిక జబ్బుకు చెందింది.

సత్యం అందరికి చెందింది, సంపద కొందరికి.

మన పనే చెబుతుంది మన దేశీయత, మన స్వదేశీయత గురించి.

మనిషే మనిషికి పరువు, మనిషే మనిషికి బరువు, మనిషే మనిషికి కరువు.

జీవితంలో నిస్వార్థంగా చేసే ప్రతి పనీ పరిచర్యే.

పసిడి పదివైపుల నుండి కొని తెస్తే, పరువు పదివేల వైపుల నుండి కొనితెస్తుంది.

చేతులిచ్చింది కొట్టడానికి కాదు, వెనుకబడిన వారిని పదండి పదండని తట్టడానికి.

కష్టం కష్టానికన్నా ఎక్కువ ఇష్టానికి చెందింది.

పెదవులు పెదవులతో మాట్లాడుతాయి, హృదయాలు హృదయాలతో.

కళల్లో కొందరు లలిత కళలకు చెందిన వారైతే, కొందరు ఫలిత కళలకు.

'మనిషి' శబ్దానికి ప్రతీక, 'మనీష' నిశ్శబ్దానికి.

దైవాన్ని ఆనందంలో చూడాలి, దైవత్వాన్ని అందంలో.

పని ప్రేమకు ప్రతీక, పనితనం ధీమకు.

భవనాలకు మల్లే భాషలకు భావాలకూ ఉంటాయి వాటి ఎలివేషన్లు.

మురుగు గుంతలకన్నా మురుగు బుర్రలు ప్రమాదకరం అంటారు పాల్కీవాలా గారు.

పెరిగితే పెరటిగా పెరగాలి  కాని పెంటగా కాదు.

మన భావాలే నిర్దేశిస్తాయి మన భాషా సంభాషణల నాణ్యతలను.

జ్ఞానాలు జ్ఞానాలు కావు, బాటలు, గమ్యాలు, లక్ష్యాలు.

శబ్దాలు శబ్దాలు కావు, శక్తులు, యుక్తులు.

కృషి, మనిషిని కల మనిషినే కాదు వెల మనిషిని కూడా చేస్తుంది.

విద్యాలయం విద్యాలయమే కాదు చికిత్సాలయం కూడా.

విద్య విద్యేకాదు అజ్ఞానానికి ఔషధం కూడా.

స్పష్టతలోనే ఉంటుంది స్రష్టయొక్క సర్వస్వమంతా.

ఎన్ని మాటలెక్కువయితే అన్ని పొరపాటు లెక్కువ.

నిజమైన విద్య చాలా వరకు మిధ్యే.

శబ్దాలు! కేవలం శబ్దాలే కాని, ఎంత గారడీలు! ఎంత ప్యారడీలు!

వృధా కాలక్షేపాన్ని మించిన వృధా ఖర్చు మరొకటుండదు.

ఏ సహాయమూ స్వయం సహాయాన్ని మించదు.

విశ్వాసం విశ్వసించే వానికొక అస్త్రం, శస్త్రం.

ఎవడు బోధిస్తాడో వాడు అధ్యాపకుడు, ఎవడు ప్రబోధిస్తాడో వాడు ఆచార్యుడు.

ఎవడు సుత్తెతో మొదలెడతాడో వాడు తుదకు సుత్తెకే బలవుతాడు.

బోధకుడు బోధకుడు మాత్రమే అయితే కృషీవలుడు, సాధకుడు కూడా అయితే ఋషీవలుడు.

బాధలే లేకపోతే లేవేవీ భావాలు, సాధనలు, శోధనలు, పరిశోధనలు.

వస్తువుల ధరల పెరుగుదల మానవుల విలువల తరుగుదలకు నిదర్శనాలు.

ఏది సరయిందో అది అందరికీ ఆమోదమయింది కావచ్చు కాకపోవచ్చు.

జ్ఞానం ఆలోచనను పెంచుతుంది, ఆలోచన అంతర్ మధనాన్ని, అంతర్ మధనం వికాసాన్ని, వికాసం వినయాన్ని, వినయం వివేకాన్ని, వివేకం సార్థాన్ని, సారాన్ని.

మతం మరేమీ కాదు మనని మనం తెలిసికోవడం తప్ప.

విద్యెప్పటికీ కథలా చెప్పాలి కాని హరికథలా కాదు.

విద్యంతా చూచేవాటితో మొదలెట్టాలి కాని చూడని వాటితో కాదు.

నిజమైన మనిషి ఈ లోకంలో ఎప్పటికీ ఏకాకే.

అంటరానివాళ్ళంటే హరిజనులు కారు, అపరిశుభ్రమైనవారు.

గుణం లేని గుండె దీపం లేని గుడితో సమానం.

ఒకే ఒక రూపున్నవాడు ఉండనట్లే, ఒకే ఒక గుణమున్నవాడు, విశ్వాసమున్న వాడుండడు.

విద్య సంగతులు, సమాచారాల కొరకు కాదు, సంస్కారాల కొరకు.

స్వేచ్ఛ ఒకేసారి పొందేది కాదు, పొందుతూనే ఉండేది.

బాధకు జ్ఞానాన్ని మించిన విరుగుడు మరొకటి లేదు.

విషాదాన్ని మించిన సత్యం, సంస్కారాన్నిమించిన విద్య మరొకటి లేదు.

రాళ్ళు రాళ్ళు కావు మూగబోయిన ఆత్మలు.

నవ్వు స్నేహితానికి ఆరంభమే కాదు అంతం కూడా.

విషాదం విచారాన్ని ప్రేరేపిస్తుంది, జాలి అవగాహనను ప్రతిబింబిస్తుంది.

ఐదు విశ్వాసాలే మనకుంటే అయిదుగురితో సమానం అన్నారు వివేకానంద.

కొందరి జీవితాలు మందారాలు, కొందరివి మకరందాలు, కొందరివి వట్టి తప్పోతాలూ.

జీవితమెప్పటికీ అనుభవం ద్వారా జ్ఞానం కన్నా ముందు నడుస్తుంది.

మనిషి మనిషి కావాలంటే స్వేచ్ఛ స్వేచ్ఛ కావాలి, స్వేచ్ఛ స్వేచ్ఛ కావాలంటే క్రమశిక్షణ క్రమశిక్షణ, క్రమశిక్షణ క్రమశిక్షణ కావాలంటే శిక్షణ శిక్షణ.

నిజమైన వినడం వేదాన్ని వినడం. నిజమైన తెలిసికోవడం బీజాన్ని తెలిసికోవడం.

ఎవడు ద్విజుడో, కాడో నిర్ణయించేది అతని పుట్టుక కాదు, ఆతని మెట్టుక.

పని ప్రేమే కాకపోతే పనిచేసే వానికీ బిచ్చగానికీ తేడా లేదు.

ద్రవ్యాన్నుండి సవ్యాన్ని పిండుకోవడమే దార్శనికత, తాత్త్వికత.

సుఖం అతిత్వరగా ముసలాన్ని చేస్తుంది, ఆనందం యవ్వనున్ని.

శుద్ధి వృద్ధికి దారి, వృద్ధి అభివృద్ధికి, అభివృద్ధి అభ్యున్నతికి.

సృజనంతా స్థూలాన్ని సూక్ష్మంలోకి మార్చడమే.

వ్యక్తిత్వమెప్పుడూ వ్యక్తికన్నా ముందు నడుస్తుంది.

గుణం లక్ష్యాన్నే కాదు, పక్షాన్ని కూడా సూచిస్తుంది.

చేయడం, చూడడం, వినడం, విశ్వాసంపై ఆధారపడి ఉంటుంది.

అనుభవాలు వాడితే అవే అవుతాయి బాటలు, తోటలు, మూటలు.

ఓ కాలపు కళలు తెలియాలంటే ఆ కాలపు కలలు తెలియాలి.

కొత్తది కావాలంటే పాతది మార్చాలి, కూల్చాలి.

చేతకు నేత తెలియాలి, ఈత రావాలి.

శబ్దాలకు అర్థాలున్నట్లే రూపాలూ ఉంటాయి, తాపాలు.

మతాలు చాలా వరకు  ఆచారాల్లో విభేదిస్తాయి కాని ఆదర్శాల్లో కాదు.

చరిత్ర మరేమీ కాదు మానవుని తప్పొప్పుల పట్టిక.

ధ్వని కొరకు పనికొరకే కాకపోతే అక్షరంతో పనే లేదు.

లేనివి లేనివి కావు, కనబడనివి కనబడనివి; వినబడనివి వినబడనివి,
అవి తెలియనివి, అపరిచయమయినవి మాత్రమే.

అందరూ అదే దారి నడిస్తే రంకుదారయినా అవుతుందది రహదారిలాంటిది.

నవీనతంటే మరింత సవ్యత, మరింత నాణ్యత, మరింత ప్రాయోజనత.

పెదవులతో మాట్లాడేవి మాటలు, హృదయాలతో మాట్లాడేవి తేటలు.

నాణ్యత మాన్యతకు దారి, మాన్యత మనుగడకు రహదారి.

విలువల వలె చెప్పబడని పాతాలన్నీ కేవలం నిలువలు, వలువలు.

విద్యంతా విషయాలను విలువల కొరకు, వికాసాల కొరకు తూర్పాల పట్టడమే.

కులాలను కాదు మనం గుర్తించాల్సింది, కులీనులను.

భావం భాషను, భాష జ్ఞానాన్ని, జ్ఞానం అవగాహనను, అవగాహన అర్థాన్ని, అర్థం సార్థాన్ని పుట్టిస్తాయి.

ఏది హృదయానికి బోధిస్తుందో అదే బోధన, తక్కిందంతా బాదన, రోదన.

అందం అందంతోపాటు మంచితనం కూడా అయితే మరీ అందమయిందవుతుంది,
మంచితనం మంచితనంతోపాటు అందమయిందయితే మరీ మంచిదయింది.

వలువలు కూడా ముఖ్యమే కాని విలువలతో పాటు వలువలు.

హితులు చాలా మంది దొరుకుతారు జీవితాల్లో, దొరకందల్లా మంచి స్నేహితులే.

స్వేచ్ఛ అవకాశం కొరకు, అవకాశం అభ్యుదయం కొరకు.

పఠించడానికి చదువు, ప్రయోజనానికి విద్య.

కవి కలంతో కాలాన్ని వాలంలోకి మార్చే కళాకారుడు.

పాలసీలు ముఖ్యం కాని పరిపాలనలకు నోచుకోకపోతే కావవి సౌఖ్యం.

అన్ని పూలూ ఒకటే కానట్లే అన్ని నవ్వులూ, అన్న చూపులూ ఒకటే కావు.

జీవించడమంటే అందం ఆనందమంటే ఏమిటో కనుగొనడమే.

ఒక విషయాన్ని బైట సృష్టించాలంటే మొదట దానిని మనం మన లోపల సృష్టించుకోవాలి.

తెలివి ఉన్నదానిని లేనిదానిలోకి, లేనిదానిని ఉన్నదానిలోకి మార్చే శక్తి, యుక్తి.

ప్రతి లక్ష్యానికి ఒక లక్షణముంటుంది, ప్రతి లక్షణానికి ఒక లక్ష్యం.

భావాలు వట్టి భావాలుకావు, విలువలు, వివేచనలు, విచారాలు.

అన్నిటికన్నా అత్యుత్తమ కళ జీవన కళ, అందుకే దానికి అంత వెల.

ఘడియల్లో కొన్ని ఘడియలు దశ మార్చే వైతే, కొన్ని దిశ మార్చేవి.

అందాన్ని పట్టుకోవడం ప్రతిభ, ముట్టుకోవడం ముచ్చట.

అభ్యున్నతికి కావలసింది అనుకరణ కాదు, అనుసృజన.

నీవు ప్రపంచాన్ని మార్చలేకపోతే ప్రపంచమే నిన్ను మారుస్తుంది జాగ్రత్త!

అధ్యయనానికి ఆలోచన, అనుభవానికి సులోచన.

కార్మికుడు కళాకారునిగా మారడమే మనిషి మహనీయుడు కావడం.

స్వాతంత్ర్యం సంపాదించుకోవలసిందే కాని అడుక్కోవలసింది కాదు.

సహనం సంస్కారానికి దారి, సత్యానికి రహదారి.

యవ్వనమొక్కటే యాదృచ్ఛికంగా నవ్వుతుంది, తక్కినవన్నీ కుచ్చితంగా.

ప్రేమ జ్ఞానానికి, పెళ్ళి ప్రపంచ జ్ఞానానికి చెందింది.

ప్రతి ముఖ్యమయిందీ కష్టమయిందే, ప్రతి కష్టమయిందీ ముఖ్యమయిందే.

పరపాలన కన్నా స్వపరిపాలన మేలు, స్వపరిపాలన కన్నా సుపరిపాలన.

మాట్లాడేది కళ, మాట్లాడించేది కల.

కళల్లో ఆత్మే కాదు, చూడగల్గితే పరమాత్మా ఉంటాడు.

నవీనత ప్రధానంగా మౌలికత, సార్వకాలీనత, సార్వత్రికత.

మన చరిత్రలన్నీ గుణ చరిత్రలకన్నా ఎక్కువ ధన చరిత్రలు, రణచరిత్రలు, రుణ చరిత్రలు.

ఈ యుగపు ప్రత్యేకత ఉత్పత్తి సౌష్టత, ఉపయోగ దౌష్టత.

కొందరు మరణించి కూడా జీవిస్తారు, కొందరు జీవిస్తు కూడా మరణిస్తారు.

ఈనాటి విద్యల్లో విద్యలకన్నా విన్యాసాలెక్కువ, సారాలకన్నా భారాలు.

ఈనాటి విద్యంతా వేదనకు చెందింది కాదు, వాదనకు, బాదనకు.

సమానతే కావాలంటే సమర్థత కావాలి, నాణ్యత, ప్రావీణ్యత.

ఎవరు మానవత్వంతో జీవిస్తారో వారే మానవులు, తక్కినవారు దానవులు.

వ్యక్తికి శ్వాస ఎలాంటిదో ప్రజాస్వామ్యానికి స్వేచ్ఛ అలాంటిది.

ధనం ఆర్జనకు చెందింది, ఘనం సముపార్జనకు.

జీవితంలో ఛలోక్తి తెలిసినవాడే చలోయుక్తి కూడా తెలిసినవాడవుతాడు.

పనిముట్లను నిందించేవాడు అయితే పనికి రానివాడు, లేకపోతే పనికేరానివాడు.

నిజమైన కవిత్వం ప్రతిధ్వనిలా ఉండాలి కాని ధ్వనిలా కాదు.

ఒకరిని తూకం వేయాలంటే బాట్లతో కాదు తూకం వేయాల్సింది అతడు పడిన పాట్లతో.

కరువుల్లో కరువు అతి అరుదైన కరువు పరువు కరువు.

మత్తు మందుల్లోకల్లా అతి మత్తు మందు కుల రాబందు.

మన నిజాయితీ మన విలువను పెంచుతుంది, మన విలువ మన గౌరవాన్ని, మన గుర్తింపును.

జ్ఞానానికి విలువెక్కువ, ప్రపంచ జ్ఞానానికి ఖరీదు.



# వినోదం

జపానులో భావాలు బంగారాలతో సమానం, ఇండియాలో ఆవాలతో.

ఇపుడు అన్ని వాదాల్లో కల్లా అతి జనరంజక వాదాలు నాలుగు -
అతివాదం, అపవాదం, అవకాశవాదం, ధన్యావాదం.

అధునాతనమంటే మనమేది ధరిస్తే అది
ఇతరులు ధరించేది పురాతనం, సనాతనం.

పల్లెటూరి వాన్ని చూస్తే పట్టణపు వానికి వినోదం
పట్టణపు వాన్ని చూస్తే పల్లెటూరి వానికి విడ్డూరం.

ఆడవారిని ఆకట్టుకోవాలంటే రెండే రెండు మార్గాలు,
అయితే "హనీ" అని పిలవడం, లేకపోతే ఇందా "మనీ" అని అందివ్వడం,
ఉభయమయితే మరీ సులభం.

మనమేది పాటిస్తామో అది ద్వైతం, ఏది బోధిస్తామో అది అద్వైతం.

ఒకప్పుడీ దేశంలో ఇంటింటా రామాయణం పఠించేవారు, ఇపుడు కామాయనం.

అధికారంలో కాస్తంత కారమే లేకపోతే
ఉప్పు లేని ఉపాహారం, కొప్పుకందని హారం.

పదివేలు మాత్రమే జనాభా ఉంటే కాదది పట్నం
పది లక్షలు దాటితే మాత్రమవుతుంది సత్రం.

ఒక నటికి తల్లి కావడం కన్నా నడుం నల్లీ కావడం ఎంత కష్టమైనా ఎంతో ఇష్టం.

మన దేశంలో మనమిపుడు ఆటగాళ్ళ కన్నా ఎక్కువ మాటగాళ్ళం,
మాటగాళ్ళ కన్నా ఎక్కువ మూటగాళ్ళం.

అతి ధనవంతులు కావడానికి ఒకే ఒక మార్గం, పెడ మార్గం, చెడు మార్గం.

హ్యూమరంటే వికెట్ గేటు నుండి రావడం లాంటిది
రూమరంటే బ్యాక్ గేట్ నుండి పోవడం లాంటిది.

మగవారికి సిగరెట్టులంటే ఇష్టం, ఆడవారికి సిగలెట్టులంటే.

పురుషులకు హాస్యాలంటే ఎంతిష్టమో, స్త్రీలకు రహస్యాలంటే అంత, మరింకొంత.

ఈ రోజుల్లో వధూవరులు కోరేవి ముచ్చటగా మూడే మూడు
అందం, అద్దకం, అర్థం, తక్కిందంతా వ్యర్థం.

ఇపుడీ ప్రపంచంలో ఎక్కువ చలామణీ అవుతోంది
వేదమూ కాదు, వాదమూ కాదు, పచ్చి జూదం.

ఈనాటి రాజకీయానికి మరో పేరు వ్యాపారం
విద్యకు మరోపేరు వినోదం, విలాసం, మోసం.

మగవారికి కావలసింది శృంగారం, ఆడవారికి బంగారం, సింగారం.

మన దేశంలో మనకిపుడు ఎక్కువగా తటస్థించేది వేదాంతం కాదు, వేద అంతం.

ఎవరి సహజతనైనా పాడు చేయాలంటే ఒకే ఒక మార్గం, సంస్కరణ మార్గం.

ఎవరినైనా అతి త్వరగా ముసలి వాళ్ళను చేయాలంటే ఒకే ఒక మార్గం,
అతి పొగడ్తల దుర్మార్గం.

ఈనాటి నాగరీకతంతా, ఇంట సమరం, బైట భ్రమరం.

జీవితంలో కాస్తంత హాస్యమే లేకపోతే జీవితమంతా హాస్యం, అపహాస్యం, నైరాశ్యం.

పెండ్లి కాని వారికి కాని వారు బెల్లం, అయినవారు గొళ్ళెం.

ఈనాటి ఇళ్ళల్లో కుక్కదే ప్రథమ స్థానం, కుక్కదే ప్రథమ ఆహ్వానం
కుక్కదే ప్రథమ సోపానం.

ఈ దేశంలో మనమిపుడు పండగ రోజుల్లో దేవుళ్ళను పూజిస్తాం
ఇతర రోజుల్లో దయ్యాలను పాటిస్తాం.

ఇపుడీ దేశంలో ఒక స్త్రీ అతి త్వరగా రాజకీయాల్లో ఎదగాలంటే
ఒకే ఒక మార్గం, భర్తను పోగొట్టుకునే మార్గం.

ఈ రోజుల్లో ఎవరైనా ఎవరినైనా నమ్మించి ముంచాలంటే ఒకే ఒక మార్గం.

మూడు మూడు అడ్రస్‌లు, మూడు మూడు టెలిఫోన్ నంబర్లు, మూడు మూడు కార్ల నంబర్లు, మూడు మూడు క్లబ్బుల నెంబర్లు, మూడు మూడు బ్యాంకుల పేర్లు, మూడు మూడు రెఫరెన్స్‌లు 'సప్లై' చేయడం.

ఏ సందేశమూ లేకుండా  ఘంటలు ఘంటలు మాట్లాడడమే
ఈనాటి అనేకానేక ఉపన్యాసకుల సందేశం.

ధనం కావాలంటే వ్యాపారం, ఘనం కావాలంటే రాజకీయం
ఉభయం కావాలంటే రాజకీయ వ్యాపారం.

ఏ వ్యసనమూ లేకుండా బ్రతకడం అటు వ్యవహారమూ కాదు
ఇటు వ్యవసాయమూ కాదు, ఉప్పూ కారమూ లేని వట్టి ఉపహారం.

ఇపుడీ దేశంలో అతిగా చలామణీ అవుతోన్న సాహిత్య వాదాలు -
స్త్రీ వాదం, మైనారిటీ వాదం, దళిత వాదం, అభ్యుదయ వాదం,
ప్రాంతీయ వాదం, అరసం, విరసం, అన్నిట్లోకల్లా అతి తక్కువ సరసం.

అపుడపుడే పెళ్ళి చేసికున్నవారికి కావలసినవి అటు మంచం, ఇటు కంచం
మరి వేరే పట్టదేదీ వారికి మరొక లంచం.

ఇపుడు అందాలు తెలియడం విద్యకాదు, ధందాలు తెలియడం.

ఎర్ర జెండాను తట్టుకోవడానికి ఒకే ఒక మార్గం
ఎర్ర జెండా కన్నా మరింత ఎర్ర జెండా ఇంటి కప్పుపై ఎగరవేయడం.

'ప్రపోజ్' చేయడమంటే ప్రేమించడం కాదు, ప్రేమిస్తాను, ప్రేమిస్తానని నమ్మించడం. 'ఐ లవ్ యూ, ఐ లవ్ యూ' అని అదే పనిగా వల్లించడం.

మన దేశంలో మనం ఇంట తాబేళ్ళం, బైట లేళ్ళం, కుందేళ్ళం.

ఆడవారికి పెళ్ళి ఒక కొడెమైతే, మగవారికొక మెడ కోడెం.

ఈ రోజుల్లో ఏది ఆలోచిస్తే అదే చెప్పడం విపత్తు కొని తెచ్చుకోవడం.

రొమాన్స్‌కు గతం పాపం, పురాతనం శాపం.

అవినీతి అవసరమైన దానిని ఎక్కువ ధర చెల్లించి కొనుక్కోవడం.

కొందరికి ఎప్పుడూ మారడం మతం, కొందరికి మారక పోవడం అభిమతం.

ఈనాటి అవార్డుల, రివార్డుల, పురస్కారాల ప్రదానం - బతకమ్మ పండగల్లో ఇచ్చుకో గౌరమ్మ, పుచ్చుకో గౌరమ్మ లాంటి పరస్పర వైనం.

"పెళ్లి యొక్క ఒకే ఒక బలహీనత పెళ్ళి చేసికోని వారి దృష్టిలో పెళ్ళి చేసికున్నవారిని పేలవం చేయడం." అంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

ఏది తంత్రమో అది మతం, ఏది కుతంత్రమో అది రాజకీయం.

ఆశావాదమంటే కళ్ళిగిలించి చూడడం, నిరాశావాదమంటే పళ్ళిగిలించి.

ఈ దేశంలో మనం నిర్ణయాలు తీసికోవడం కన్నా
నిర్ణయాలు తీసికోగూడదని నిర్ణయాలు తీసికోవడంలో ఘనాపాటీలం.

ప్రతిభావంతులకుండేవి మూడే మూడు జబ్బులు,
అతిగా త్రాగడం, అతిగా వాగడం, అతిగా చెప్పుకోవడం.

మన దేశంలో ఇపుడు మగవారి ఆశయం అమెరికాకు పోవడం
ఆడవారి ఆశయం వారిని పెళ్ళాడడం.

"వివాహాలు నెగ్గాలంటే భార్యా భర్తలకు ఎంతో కొంత నటనలో ప్రవేశముండాలి "
అంటారు ఆస్కార్ వైల్డ్ గారు

సోషలిజమంటే అంతా మనదేననుకునే మిధ్యావాదం, ఎండమావి వాదం.

ఈనాటి నాగరికతకు సత్యం కాదు కావలసింది భత్యం.

వాదం ముదిరితే వివాదం, వివాదం ముదిరితే విరోధం, విరోధం ముదిరితే యుద్ధం, యుద్ధం ముదిరితే రుద్ధం.

హాస్యం ముదిరితే అపహాస్యం, అపహాస్యం ముదిరితే అసభ్యం, అసభ్యం ముదిరితే అనాగరీకం.

తెలివి ఉన్నదానిని ఉట్టికెక్కించే చాతుర్యం, చలాకీతనం.

ఈ రోజుల్లో కవిత్వం పేరట చలామణీ అవుతున్నదంతా
కవిత్వం కన్నా ఎక్కువ, కసిత్వం.

ఒకప్పుడు మునులుండేవారీ దేశంలో ఎక్కువగా,
ఇపుడు కొంపలు ముంచే ఘనులు.

ఒకప్పుడు ప్రభుత్వ రంగ గూఢాచారులెక్కువుండేవారీ దేశంలో
ఇపుడు పత్రికా రంగ రూఢాచార్లు.

ఇపుడు ప్రభుత్వాలు హద్దు లేకుండా పాలించుటకు
శాసన సభ చర్చా సమయాలన్నీ ఏదో విధంగా రద్దులే.

బట్టతలలకు బహు ఆలోచనలకు చాలా దగ్గరంటారు జాగ్రత్త మరి.

ఈనాటి రాజకీయాల్లో గిట్టుబాటు లేకుండా వట్టి పాటు ఎవ్వడూ పడడు.

అందరూ ఏదో ఒక విధంగా బిచ్చగాళ్ళే, కొందరు చాలి కూడా, కొందరు చాలక.

పండితులకు, ప్రతిభావంతులకు వేరే విరోధులెవరూ ఉండరు,  వారికి వారే.

ఇపుడీ దేశంలో అవినీతి అంతటా ఒప్పే, తప్పన్నవారిదే తప్పు, వారికే ముప్పు.

ఈనాటి సంభాషణల్లో పదాల కన్నా ఊత పదాలదే జోరెక్కువ, హోరు.

ఈనాటి జీవిత అంగళ్ళ మంగళ్ళ గురించి
తండ్రులకన్నా కొడుకులకే ఎక్కువ తెలుసంటారు ఆస్కర్‌వైల్డ్ గారు.

కొందరి కొందరి కృతజ్ఞతా వాక్యాలు చాంతాళ్ళను మించిన చాంతాళ్ళు, మోకుదాళ్ళను మించిన మోకుదాళ్ళు. దండెళ్ళు,

ఈనాటి స్త్రీలకు చెందిన రహస్యాలన్నీ
మన సినీమాల సీరియల్ల పుణ్యమా అంట అపహాస్యాలే.

ఈ కాలంలోనైనా, ఏ కాలంలోనైనా చురుకైన వాళ్ళ కంటే చురుకంటించే వారిదే పై చేయి.

ఇపుడెక్కడ లభిస్తుంది మీకు ఒకప్పటి లాంటి  కల్చర్
ఈనాటి Flatల పుణ్యమా అంట ఇపుడంతా అంతటా Flat కల్చరే.

వలలకు పాశ్చాత్యులది పై చేయి, కలలకు మనది.

మన పరిపాలకులకు రెండు హక్కులుంటాయి
ఒకటి వారు తినడానికి, రెండవది, తదితరులది తిరగదోడడానికి.

ఒకప్పుడు రాజకీయాలలో సేవకులుండేవారు, ఇపుడు సేవించువారు.

ఈనాటి రాజకీయాలకు తలలు కావు కావలసినవి, తలూపులు.

అద్దాలకే అసువులుంటే అయ్యో! అనేవ్వేవి మన వేషాలను చూచి, మన ద్వేషాలను తూచి.

ఈనాటి విద్యార్థులంతా వారి ముస్తాబులకిచ్చినంత సమయం కూడా
వారి "కితాబులకు" (పుస్తకాలు) ఇవ్వరు.

ఒకప్పుడు ఆచార్యులుగా కూడా పనికి రాని వారు అయ్యయ్యో! అయిపోతున్నారిపుడు అవలీలగా ప్రధానాచార్యులు.

ఇపుడు వలలకున్నంత గిరాకీ కలలకూ లేదు, కళలకూ లేదు, వెలలకూ లేదు.

"ఈనాటి ఆర్థిక పరిస్థితుల్లో పొదుపు చేసికున్నవాని పని పొల్లు
చేసికోని వాని పని చెల్లు" అనేవారు పాల్కీవాలా గారు.

మగవారు ఆడవారిని ఎప్పుడూ ఓ కంట చూస్తారు, ఆడవారు మగవారిని ఓరగంట.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు ఒకప్పటి లాంటి ఆచార్యులు
ఇపుడంతా అంతటా భ్రష్టాచార్లు, పానాచార్లే.

కొందరు మాట్లాడేది సంభాషణలా మాట్లాడీ మాట్లాడీ ఎలా ఉంది నా ఉపన్యాసమంటారు కొందరు ఉపన్యసించేది సంభాషణలా ఉపన్యసించీ ఉపన్యసించీ ఎలా ఉంది నా ఉపన్యాసమంటారు. ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు.

ఈ కాలం వెలగల, తలగల మనుషులది కాదు, పక్కా వలగల మనుషులకు, వల్లకాడు మనుషులకు చెందింది.

కొందరు గురువులు చెప్పేవారైతే, కొందరు చెప్పేవారిని దెప్పేవారు.

స్త్రీలకు మంచికన్నా సంచిపై మోజెక్కువ.

కొందరు కొందరు వీరూ కారు వారూ కారు
వీరి ముసుగులో వారు, వారి ముసుగులో వీరు.

ఒకప్పుడీదేశంలో మిషనరీలు (Missionary) ఎక్కువుండేవారు.
ఇపుడు వారి స్థానాన్నే మెర్సనరీ (Mercenery) లు.

ఒకపుడు సక్రమజాతి వారెక్కువుండేవారీ దేశంలో, ఇపుడు అక్రమ జాతివారు.

ఇపుడు వైద్యాలయాల్లోకన్నా విశ్వవిద్యాలయాల్లో డాక్టర్లే ఎక్కువగపడతారు మీకు.
అందుకేనేమో విద్యాలయాలు కూడా అయిపోతున్నాయి వైద్యాలయాల్లాంటివిపుడు, విద్యార్థులు పేషంట్లలాంటివాళ్ళు.

ఈనాటి విద్యల్లో సమాచారం గంపెడంత, సంస్కారం గంటెడంత
అందుకే ఇపుడు విద్య గంపెడంత, వికాసం గరిగెడంత, వివేకం మాత్రం గంటెడంత.

ఈనాటి రాజకీయాలకు కావలసినవి యోగ్యతలు కావు
కుల యోగ్యతలు, దళయోగ్యతలు, దళారీ - యోగ్యతలు.

ఈ రోజుల్లో నినాదాలకున్నంత గిరాకీ
నాదాలకూ లేదు, వాదాలకూ లేదు, వేదాలకూ లేదు.

ఈనాటి ప్రభుత్వాల పాలనలన్నీ పాత్రికేయులకు సందులు
కార్టూనిస్టులకు విందులు, మిమిక్రీ వారికి పసందులు.

ఒకపుడీ దేశంలో “ ‘నిద్దా, జాతి వారెక్కువుండేవారు
ఇపుడు వారి స్థానే ‘గద్దా జాతి’ వారు.

ఈ రోజుల్లో పత్రికలే ఎక్కువ చదువుతున్నారు మన పుత్రికలు
అందులోనూ అశ్లీల చిత్రికలు.

కొందరు బంతుల్తో ఆడుతారు ఆటలు
కొందరు తంతుల్తో వదంతుల్తో.

పాశ్చాత్యులు అవసరాల కొరకు ఐక్యమవుతారు, మనం అనవసరాల కొరకు.

ఇపుడీ దేశంలో “దొంగ”కు, “లంగ”కున్నంత గిరాకీ
“గంగకూ” లేదు,“అలివేలు మంగకూ” లేదు.

అవినీతి అతి ధనవంతులకు, అతి విద్యావంతులకు చెందిన సుఖ వ్యాధి.

మార్క్స్ చెప్పిందంతా వేదాంతమే
మనం తెలియకనుకుంటాం అదేదో వేరే సిద్ధాంతమని.

సత్యమొక్కటి తప్ప సవాలక్ష లభిస్తాయి మనకీ రోజు

మన కోర్టుల్లో, పోర్టుల్లో, రాజకీయవాదుల హోర్టుల్లో.

ఇపుడీ దేశంలో ఎలక్షన్లు గెలవడానికి, పని కాదు కావలసింది,
మనీ, అవినీతులు, అడ్డత్రోవలు so many.

కుక్కలు బొక్కలపై పోట్లాడుతాయి, రాజకీయ నక్కలు పక్కలపై.

"ఇపుడు మన ఊళ్ళల్లో ఒకటి కాదు వంకర
తుదకు తాడిచెట్టు కూడా వంకరే'' అంటారు ఆచంట జానకిరాంగారు.

ఈనాటి రాజకీయాల్లో రూపుల కన్నా బహురూపులెక్కువ, బహురూపులకన్నా, డూప్‌లు.

భారతీయ విద్యార్థులు అన్ని శిక్షణలకూ పనికొస్తారట
ఒక్క అన్నిటికీ పనికొచ్చే క్రమశిక్షణకు తప్ప.

ఈనాటి నాగరీకతంతా మనుషులకన్నా ఎక్కువ పని మనుషులను, పని మనుషులకన్నా ఎక్కువ మనీ మనుషులను పుట్టించుటకు చెందింది.

విలువైన భారతీయ విలువల్లో సమయపాలనకు, క్రమశిక్షణకు అంతంతే విలువ.

ఒకప్పుడీ దేశం 'రాం రాజ్‌కు' ప్రతీతి, ఇపుడు 'స్కాం రాజ్‌కు'.

ఈ ప్రపంచంలో ఇపుడొక పన్నాగునికున్నంత ఖదరు
పతాకకూ లేదు, ప్రధాన మంత్రికీ లేదు.

అన్ని పాటలకన్నా వేలం పాటను మించిన జనరంజకమైన పాట
మరొకటి లేదంటారు పఠాభిగారు.

జీవితం ఒక లెక్క కాదు, ఒక నక్క
అందుకే మరెంత కష్టపడ్డా కాదది మీరనుకున్నంత పక్కా.

అందమైన వాటిని చూడాలంటే నగరాలకు వెళ్ళాలి
అందమైన వారిని చూడాలంటే పల్లెలకు.

ఇపుడు మీకు నిజమైన భారతీయులు కావాలంటే
ఇంట కాదు వెదకాల్సింది బైట, దేశంలో కాదు విదేశంలో.

మీ జోలికెవ్వరూ రాగూడదని అనుకుంటే చేయండి ఒకే ఒకపని.

చెసేది చెప్పకండి, చెప్పింది చేయకండి.

జీవితాల్లో కొందరు తమాషాకు పెళ్ళాడితే, కొందరు దామాషాకు.

రాజకీయాలలో, వ్యాపారాలలో మూగవారే అవుతారు ఒక్కొక సారి మగవారు.

ఇపుడీ దేశంలో అనృతమొక అలవాటే కాదు ఒక బాహాటు.

మగవారికి ఆస్తులపై మోజెంతో, ఆడవారికి అలంకారాలపై అంత.

మన విద్య నిజంగానే విద్యయితే ఈ పాటికెన్నో వచ్చేవి తిరుగుబాట్లు, ఉద్యమాలు, విప్లవాలు, అతివాదాలు, ఉగ్రవాదాలు.

కొందరి కొందరి శక్తంతా వారి అతిశయోక్తిలోనే ఉంటుంది
అది కాస్తా తీసేస్తే వారిలో మిగిలేది అశక్తే.

ఈనాటి విద్యలన్నీ చాలా వరకు ఏవి చదవగూడదో చదవడానికి, వినగూడదో వినరు. చూడగూడదో, ఆలోచించగూడదో, అలవర్చుకోగూడదో వాటికి చెందినవే.

కాంగ్రెస్ వారిదదొక సంస్కారం, ఒకరు ఎక్కుతుంటే
ఒకరు కుక్కుతుంటారు అంటారు కరుణాకారన్‌గారు.

మగవారికి భరణాలపై ఎంత మోజో ఆడవారికి ఆభరణాలపై అంత.

మన విద్యంతా ఒకపుడు వివేకులను పుట్టించేదెక్కువగా
ఇపుడు చాకులను, బాకులను, కాకులను, జోకులను, మేకులను.

పల్లెటూళ్ళలో తాపాలెలాగూ తక్కువే కనుక పాపాలూ తక్కువే.
పట్టణాలలో తాపాలు ఎలాగూ ఎక్కువే కనుక పాపాలూ ఎక్కువే.

ఈనాటి పెళ్ళిళ్లలో పొంతనాలకన్నా మంతనాలదే, వంతనాలదే పై చేయి.

ఈనాటి మన సెక్యులరిజానికీ, ఒకనాటి మన న్యూట్రలిజానికీ
తేడా లేదు ఈవెన్ బేడా.

ఈ కాలపు నాగరీకులంతా బైట నాగరీకులు, ఇంట నగరీకులు.

ఒకప్పటి మనుషులంతా కళలు, కళకళలు
ఇప్పటి వారు అదేదో అంతుపట్టని గలగలలు, ఫెళఫెళలు, విచ్చలవిడి విహ్వాలలు.

ఒకప్పటి టెంటుకూ ఈనాటి అపార్టుమెంటుకూ తేడా లేదు ఈవెన్ బేడా.

ఈ కాలపు విద్యలలో మీకు ఎంత తెలుసు ననేదానికన్నా
ఎవరు తెలుసు ననేదానికే ప్రాధాన్యతెక్కువ.

ఈనాటి అందాలలో, అందాల కన్నా అద్దకాలది, రుద్దకాలది జోరెక్కువ.

ప్రతీది లేదని వాదించకు, తుదకు నీవే లేవనుకాడికొస్తుందది.

ఇపుడెక్కడివి ఒకప్పటి ఇళ్ళ లాంటి ఇళ్ళు, గృహాలు
ఇపుడన్నీ అంతటా అపార్టుమెంటులు, అద్దె కొంపలే.

అదేమిటో కాని అతిగా ఆలోచించే వారెప్పుడూ అదోలా అనిపిస్తారు
అవసాన దశకు దగ్గర పడ్డ వారిలా.

ఈనాటి విద్యార్థుల్లో రాతల కన్నా, గూతల కన్నా
కోతలది, మోతలది జోరెక్కువ.

ఆడవారికి అభిప్రాయాలకన్నా ప్రియాలెక్కువ.

ఈ కాలమంతా ప్రతిభెక్కువ పతార తక్కువకు, బరువెక్కువ పరువు తక్కువకు చెందింది.

జీవితాలలో కొందరి జీవితాలు సూత్రాలైతే, కొందరివి సుసూత్రాలు.

కొందరి ఇష్టమంతా వారిని ఇష్టపడడంలోనే ఉంటుంది, తక్కిందంతా వారికి కష్టమే.

ఈ రోజుల్లో జ్ఞానం మూరెడు, వికాసం జానెడు, వివేకం వ్రేలెడు
అందుకే మనకిపుడు సంక్షోభం మూరెడు, సంక్షేమం జానెడు, సంతోషం వ్రేలెడు.

ఈనాటి ప్రపంచంలో పాపులకున్నంత గిరాకీ
కాపులకూ లేదు, 'సాపు'లకూ లేదు. (సాపు = నీతి నిజాయితీ కలవారు)

స్త్రీలు ఒక ఘంట అక్కా! అక్కా! అని ఒకరినొకరు పిలుచుకుంటే
మరొ ఘంట కుక్కా! కుక్కా! అని పిలుచుకోవడం ఖాయమంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

అప్సరసలతో వాదోపవాదం, సరసంతో మొదలై
విరసానికి దారి తీస్తుంది జాగ్రత్త మరి!

అమెరికా పెళ్లిళ్ళు చాలా వరకు విడాకులకు దారి తీస్తాయి, ఇండియావి పెడాకులకు.

ఈనాటి బోధకుల బోధనలన్నీ ఒక సుత్తి, బోధనకన్నా ఎక్కువ సంపాదనకొరకే వారి కక్కుర్తి.

ఈనాటి విద్యల్లో ప్రతిభల కన్నా పట్టాలది జోరెక్కువ, పట్టాలకన్నా కాపీ కొట్టే చిట్టాలది.

కొందరి కొందరి నామాలే వారి పాలిటి అవమానాలు, వారి పేర్లే వారి పాలిటి పెంజేర్లు.

భారతీయ బాటలకు, భారతీయ బాలెంతలకు తేడా లేదంటారు even బేడా, బొరిస్ బెక్కర్‌గారు.

కొన్నాళ్ళు కాంగ్రెస్ కాంగ్రెస్ వారిని బేజారు చేసింది, ఇపుడు కాంగ్రెస్‌వారు కాంగ్రెస్‌ను.

ఇపుడెక్కడున్నాయి ఒకప్పటి లాంటి సంక్షేమ శాఖలు, ఇపుడన్నీ అంతటా స్వ-సేవా శాఖలే.

ఈ దేశంలో అయితే పనికిరాని వారైనా ప్రశ్నలేస్తారు పదే పదే
లేకపోతే పనికే రాని వారైనా, అంటారు పీ.వీ.గారు.

ఈ దేశంలో ఒక్క ప్రభుత్వోద్యోగులే కడతారు పన్నులు
తక్కినవారంతా చూస్తారు ఎగవేతలకు దారితెన్నులు.

ఇపుడెక్కడ లభిస్తాయి మీకొకప్పటి లాంటి దేవాలయాలు
ఇపుడంతా అంతటా ద్వేషాలయాలే ద్వేషాలయాలు, వేషాలయాలే వేషాలయాలు.

ఈనాటి విద్యాలయాలు నీతులకు కావు నిలయాలు, వాటి గోతులకు.

భారతీయులంతా చాలా వరకు ఇంట జమీందార్లు, బైట జమేదార్లు.

మంచి కావాలంటే మన భాష, సంచి కావాలంటే పరాయి భాష.

అందరూ రాజకీయులే, కొందరు ఆడేవారైతే, కొందరు ఆడించేవారు,
ఆడిపోసుకునేవారు.

ఒకపుడీదేశంలో వాసులెక్కువుండేవారు, ఇపుడు తిరకాసులు, బరకాసులు.

ఏ ప్రభుత్వమూ రమ్మంటే రాదు, పొమ్మంటే పోదు, రొమ్ములో దమ్ముంటే తప్ప.

గతానికి కూడా ఒక వాసనుంటుంది, గతమున్న స్త్రీలను వాసన చూడండి మీకే తెలుస్తుంది.

ఇపుడు మీకెక్కడా ఏ 'గో' లేకపోతే పెట్టండి ఒక యన్.జి.ఒ, అదే తెస్తుంది మీకు మీ 'గో గో గో'.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు ఒకప్పటి లాంటి సర్దార్లు, ఇపుడంతా అంతటా సేర్దార్లు, తాబేదార్లు, నీ బాంచెనుగాళ్ళు, నీ కాళ్ళు మొక్కుతగాళ్ళే.

ఓ కాలంలో మోతెబర్లుండేవారీ దేశంలో ఎక్కువ, ఇపుడు మోరుదోపులు.

మనం తెలిసినవారిని సంప్రదించేదెప్పుడూ తెలివిలేని పనులన్నీ చేశాకే అంటారు ఆస్కార్ వైల్డ్ గారు.

కొందరు మరవడానికి త్రాగితే, కొందరు అరవడానికి, కొందరు కరవడానికి, కొందరు చరవడానికి.
ఆధునిక మనిషి బుర్రంతా ఒక కలెగూర గంప, మురికి కొంప, ముళ్ళ కంప.

ఇపుడెటు చూచినా తటస్థించేవారు ఎక్కువ అయితే "అపవాదులు'' లేకపోతే "అతివాదులు'', మచ్చుకైనా లభించరు మీకు "నిదానులు'', "ప్రధానులు''.

ఒకపుడు మనిషి "మంచి'' అయితే అంతా అయినట్లే అనుకునే వారందరూ, ఇపుడు సంచైతే.

వింతలకు విదేశీయులది పై చేయి, కంతలకు, కలతలకు, కలవరాలకు మనది.

ఈ కాలం సిగ్గుల్దీ కాదు, ఎగ్గుల్దీ కాదు, నెగ్గుల్దీ కాదు
అక్షరాలా మగ్గుల్ది, రగ్గుల్ది, మొగ్గుల్ది, నిసిగ్గుల్ది.

ఈనాటి విద్యల్లో ప్రతిభలకన్నా పటాటోపాలది జోరెక్కువ, హోరు.

యూరప్‌లో ఒక్కొక్కనికి ఇద్దరిద్దరుంటారట ఆడవారు.
ఒకరు వాడుకోవడానికి, ఒకరు ఆడుకోవడానికి.

జీవితాలలో కొందరు హాస్యాలకు దాసులైతే, కొందరు దాస్యాలకు.

ఈనాటి నాగరికత విలువలకు చెందింది కాదు, వలువలకు, చలువలకు, చిలువలకు.

గొప్పవారనేవారు గొప్ప బేరాలే కాదు , గొప్ప నేరాలూ చేస్తారు, ఘోరాలు.

పెళ్ళిళ్ళలో నేత్రాలే కలవకపోతే ఎన్ని కలిస్తేనేమి అవి గోత్రాలు, సూత్రాలు?

ఇది "హైదరాబాధ'', తెలియదా మీకు ఇక్కడ ఎవరికీ ఏదీ కాదు సాదాసీధా, ఒక్క రాజకీయులకు, ధనవంతులకు తప్ప.

ధనవంతులకు సానుభూతి ఒక విలువ కాదు, కప్పుకోవడానికొక వలువ.

ఇపుడీ దేశంలో రెండు తరహాల మనుషులుంటారనేవారు ఫెర్నాండెజ్‌గారు ఒకరు సెక్యులర్ (pecular), ఒకరు నార్మల్.
జీవితాల్లో బైట యుద్ధాల్లా కనబడేవారంతా లోపల బుద్ధాలే, రుద్ధాలే.

అప్పటికీ ఇప్పటికీ గాంధీ అన్న పదం బ్రాందీలా పని చేస్తోందీ దేశంలో.

అపార్టుల్లో నివసించే వారు చాలా వరకు ఎవరికి వారు అపార్టే (apart).

అదేమిటో కాని ఏది చౌకో, అతి చౌకో, దాని కొరకే ఎగబడతారు లోకులు బార్ బార్.

వట్టి వారిని ఉట్టికెక్కించడంలో ప్రజాస్వామ్యాన్ని మించిన వ్యవస్థ మరొకటి లేదు.

మన రాజకీయాల్లో నీతి చాలా ఉంది, లేందల్లా నిజాయితీ,
పరిపాలకులు చాలా ఉన్నారు, లేందల్లా పరిపాలన.

ఈ కాలంలో మనం భయపడాల్సింది వ్యాఘ్రాలతోకాదు, ఉసుళ్ళలా పుట్టుకొస్తున్న గోముఖ వ్యాఘ్రాలతో.

గురువులు రెండు రకాలు, ఒకరు చెవులకు బోధించేవారు, ఒకరు హృదయాలకు.

ఈనాటి మతాల్లోనైనా, ఏనాటి మతాల్లోనైనా మతాలకన్నా మఠాధిపతులదే జోరెక్కువ, హోరు.

ఒకపుడు కంటికి ఎక్కువుండేది పని, ఇపుడు పంటికి.

మతాలు చెప్పేవాన్నీ ఒకటే, మతిలేక అవుతాం మనం కుహానామతులం.

మనకు మతం గురించి, వ్రతం గురించి ఎంత తెలుసో
పాశ్చాత్యులకు పాతం గురించి, మితం గురించి అంత.

ఈ దేశంలో ఇపుడొక సారాకొట్టు పెట్టుకోవడానికి ఎంత సునాయాసంగ దొరుకుతుందో అనుమతి, ఒక విద్యాలయం పెట్టుకోవడానికి దొరకదు.

నటీనటులు వారికి వారెప్పుడూ బ్రతకరు, ఒక్క చనిపోయినప్పుడు తప్ప.

అమెరికా అమ్మాయిలు వారి తల్లిదండ్రులెవ్వరో చెప్పరు, ఇంగ్లండు వారు వారి వయస్సులు.

కొందరి కొందరికి వారి ఛలోక్తులే అవుతాయి చలో - యుక్తులు.

హర్యానాలో చాలా మంది హరీ హరీ! అన్నిటికీ తయారేనట మరీ మరీ.

ఆడవారికి చెప్పవలసింది ఎక్కువ అబద్దాలే, నిజాలే చెబితే నీరైపోరూ
మొదలే వారబలలంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

ఈనాటి విద్యంతా మనుషులకన్నా పనిమనుషులనెక్కువ
పనిమనుషులకన్నా మనీ మనుషులనెక్కువ పుట్టించుటకు అక్కరకొస్తోంది.

ఈనాటి స్త్రీలంతా రెండు రకాలు
ఒకరెప్పటికీ స్త్రీ స్వాతంత్ర్యం గురించే మాట్లాడేవారు
ఒకరెప్పటికీ స్త్రీ స్వాతంత్ర్యం గురించే పోట్లాడేవారు.

"నిజం చాలా నిప్పయిన విలువ
పశువుల ముందు మాట్లాడగూడదు దానిని" అంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

ఈ దేశంలో ప్రతి ముగ్గురికొక పశువంటాడు (నిరక్షరాస్యుడు)
అంటారు బుచ్చిబాబుగారు.

రచయితలు, కళాకారులు మనమనుకునేటంత తెలివితక్కువవారేమీ కారు
వారి పుస్తకాలు కొట్లల్లో అమ్ముడుపోకపోతే వారినే వారు అమ్ముకో చూస్తారు కాక పట్టి.

మనం రచయితలు కథలు చెప్పే రోజుల్లో నివసించడం లేదు
వారి కథలు చెప్పే రోజుల్లో నివసిస్తున్నాం.

ఇపుడీ దేశంలో ధర్మాలేమో చెప్పడానికక్కరకొస్తున్నాయి
అధర్మాలేమో చేయడానికి.

ఒకపుడు ఈ దేశీయులు "భిక్షుకులుగా" పోయేవారు పరాయి దేశాలకు
ఇపుడు బిచ్చకులుగా.

**ఈనాటి పెళ్లి తంతు** : ముఖ చూపు, సంప్రదింపు, నచ్చడం, వర పూజ, లక్ష్మీ పూజ, పెళ్లికొడుకును చేయడం, పెళ్లి కూతుర్ని చేయడం, పెళ్లి, రిసెప్షన్, శోభనం, హనీమూన్, మారువెళ్ళి, తొలిసారి, మలిసారి.
ఖర్చులు వేలకువేలు, లక్షలకులక్షలు, కోట్లకు కోట్లు.

"చాలా మంది యువతీ యువకులు ఒకరికొకరు అర్థంకాక పెళ్ళి చేసికుంటారు
అర్థమయితే అందులో సగం చేసికోరంటారు" ఆస్కార్ వైల్డ్‌గారు.

ఈ రోజుల్లో విద్యార్థుల జవాబు పత్రాలు దిద్దబడడం లేదు
దిద్దేవారికర్థంకాక జోకబడుతున్నాయంటారు వాటిని దిద్దేవారు.

ఇపుడు పట్టణాల్లో సదరు ప్రజలకు కట్టేవన్నీ పక్కా ఇళ్ళనుకుంటున్నారా మీరు? పాపం పసివారు? కావు, కావు, లక్క ఇళ్ళు, బక్క ఇళ్ళు.

భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నపుడు కళ్ళెందుకు మూసుకుంటారు అతనిని ప్రార్థించేవారు అని అడిగారట శ్రీశ్రీగారిని ఎవ్వరో
వారిది గ్రుడ్డి నమ్మకమని చూపించడానికన్నారట వారు.

పెద్ద మనుషులంతటా ఒకటే, పరంబోకులే వేర్వేరంటారు బెర్నార్డ్ షా గారు.

ఇపుడీ దేశంలో దొరలకన్నా దొంగలకే గుర్తింపెక్కువ, అందుకే కాబోలు
మిగిలిన దొరలు కూడా త్వరత్వరగా దొంగల్లోకి మారిపోతున్నారు, దొంగల్లో చేరిపోతున్నారు.

"ఒకపుడీ దేశంలో హింసకాండ, ధ్వంసకాండ గైర్ మామూల్
ఇపుడు మామూలే కాదు, షరామామూల్" అంటారు శేషన్‌గారు.

సితారాలు వారి బార్లను, వారి కార్లను,
వారి రవికెలను మార్చేసినట్లు మార్చేస్తుంటారు, వారి భర్తలను కూడా.

మనకీ దేశంలో పని రోజులకన్నా సెలవురోజులెక్కువ
పని ఘంటలకన్నా విరామ ఘంటలు, విశ్రాంతి ఘంటలు.
ఎలా తగ్గుతుందిక మన బీదరికం, పెరుగుతుందిక ఐశ్వర్యం?

భారతీయుల శాసనాలకన్నా భారతీయ ఋతుపవనాలే
ఎంతో కొంత స్థిరమనేవారు పాల్కీవాలాగారు.

ఈ దేశంలో చదువుకున్నవారట్టే పనిచేయరు
చదువుకోని వారెలాగూ చేయలేరు.

"అవినీతి ఒకపుడీ దేశంలో కుటీర పరిశ్రమ
ఇపుడు MNC" అంటారు శేషన్‌గారు.

ఇపుడీ దేశంలో ఒక కంప్యూటర్ క్యారెక్టర్‌ను నమ్మినంత కూడా
కన్య క్యారెక్టర్‌ను నమ్మడం లేదట ఎవ్వరూ :

"మన విద్యార్థులంతా వారి విద్యాలేమిని దుస్తుల్తో సరిపెట్టుకుంటారు
వారి సంస్కార లేమిని వస్తు సేవా సౌకర్యాలతో" అంటారు ఆస్కార్‌వైల్డ్‌గారు.

ఈ దేశంలో మీరెవరినైనా ప్రభుత్వోద్యోగిని వారి ఉద్యోగం "ఫుల్‌టైమా," "పార్ట్‌టైమా" అని అడగగూడదు, అంతా ఫుల్‌టైం ఉద్యోగాన్ని పార్ట్‌టైం ఉద్యోగంగా నిర్వహిస్తూ వీలయితే ఓవర్ టైం కూడా Claim చేయజూస్తారు.

కొందరికి వారి పేర్లెలా పెట్టుకోవాలో తెలియదు,
వాటిని తిర్ల మర్ల పెట్టుకుంటారు వారి చొక్కాలు తిర్ల మర్ల తొడుక్కున్నట్లు.

ఈనాటి పాలనలన్నీ చాలా వరకు లోలనలు, లాలనలు, కరచాలనలే.

ఈ రోజుల్లో ఆదర్శవంతులైన దంపతులు మీకు కథల్లో, నవలల్లో, సినీమాల్లో, సీరియాల్స్‌లో దొరుకుతారు కాని దైనందిన జీవితంలో దివిటీ పట్టి వెదకినా దొరకరు.

బస్తీవాళ్ళెవ్వరూ చంద్రుని వైపు చూడరు ఒక్క గ్రహణం రోజు తప్ప,
ఆ రోజెలాగూ ఆతడగపడడు కదా అందుకు, అంటారు బుచ్చిబాబుగారు.

మనుషులు మూడు రకాలు
ఒకరు చేసేవారు, ఒకరు చేసేవారిపై గూసేవారు,
ఒకరు అదేపనిగా అందిందల్లా మేసేవారు.

మనుషులను చూచినా కొలదీ, చూచినా కొలదీ మనుషులమీదికన్నా నాకు కుక్కలమీద సానుభూతి పెరుగుతోందంటాడు ఒక రచయిత.

అదేమిటో కాని స్వార్థపరులే సరదాగా ఉంటారెక్కువ,
నిస్వార్థపరులు జరదాగా, పరదాగా.

రొమాన్సెప్పటికీ తిరగ వేయడం ద్వారా రక్తి కడుతుంది కాని
అరగవేయడం ద్వారా, మరగవేయడం ద్వారా కాదు.

ఎంగేజ్‌మెంట్ తాపానికి చెందింది, డేటింగ్ పాపానికి, మేటింగ్ శాపానికి.

ఆడవారికి వంటలంటే ఎంతిష్టమో, మగవారికి జంటలంటే అంత.

చాలా మంది వ్యాపారులకన్నా చాలా మంది సానులు మేలనేవారు పాల్కీవాలాగారు.

ఇపుడంతా అంతటా చలాకీలే చలాకీలు, "చలాకీ" అనునదిపుడు ముక్కుకు తగిలించుకునే బులాకీలాంటిదయిపోయింది ముక్కుపోగులాంటిది చాలా మందికి.

మీకు ఈనాటి నాగరికతల కొలతలు కావాలంటే స్త్రీల నడుములను మించినవి మరి వేరే దొరకవంటారు బుచ్చిబాబుగారు.

జనులు వారికి అవసరమున్నవేవీ ఎప్పుడూ దానం చేయరు
అక్కర తీరి, వారివే వారికి బరువయి అవతల పారేయాలనుకునేవి తప్ప.

ఈనాటి సంపాదనలన్నీ చాలా వరకు "చోరీ",
విలువలకు, సంస్కారాలకు కట్టే "గోరీ".

ఒకప్పటి చదువులన్నీ పండితులను పుట్టించేవి
ఇప్పటివి మండితులను, పిండితులను, సుండితులను, ఖరాఖండితులను.

జనులు మోతాదుగా ఉంటేనే జనులు మోతాదు దాటితే
ఇంకేముంది భరించరానంత ధ్వనులు, కొంపలు ముంచే శనులు, శకునులు.

ఇపుడు మన చరిత్రలో కనబడేదంతా ఘన చరిత్ర కాదు
ధన చరిత్ర, రణ చరిత్ర, ఋణ చరిత్ర.

ఒకపుడు కన్నీరుకు, పన్నీరుకు ఎంత గిరాకీ ఉండేదో
ఇపుడు "బీరు"కు 'బారు'కు అంత గిరాకీ.

ఈనాటి స్వేచ్ఛాప్రియులంతా మూడు తెగలకు చెందినవారు
అతి త్రాగుడుకు, అతి వాగుడుకు, అతి లాగుడుకు.

ధనవంతునికి రెండు గుండెలుంటాయి
ఒకటి కొట్టుకోవడానికి, ఒకటి గిట్టుకోవడానికి.

ఇప్పుడైనా, ఎప్పుడైనా, పన్నులెగ్గొట్టేవారే తప్ప
కనిపించరు మీకెవ్వరూ అంతగా సంపన్నులు.

ఈనాటి విద్యా వ్యవస్థలన్నీ విద్యా వ్యవస్థల కన్నా ఎక్కువ విద్యార్థుల పాలిటి విద్యా అవస్థలు.

మన ఇంటింటి అప్పులిపుడు మన ఇంటింటి కప్పులను కూడా మించిపోతున్నాయి.

ఒకపుడు ఋషి నుండి పుట్టుకొచ్చేది కవిత్వం, ఇపుడక్షరాలా కసి నుండి మసి నుండి, ఋసినుండి.

కొన్ని కొన్ని ఛలోక్తులు కారాలే కారాలు, కారాలను మించిన “చేరాలు”.

ఒకప్పటి విద్యంతా కూటి కొరకు, ఇప్పటిది మాత్రం అక్షరాలా లూటి కొరకు.

ఈనాటి శాసన సభల్లో మన్మథుల కన్నా, ధన్మథులు, గన్-మథులెక్కువ కనిపిస్తారు మనకు.

పల్లె ముదిరితే పట్టణం, పట్టణం ముదిరితే ముఖ్య పట్టణం
బల్లి ముదిరితే ఊసరవెల్లిలా.

ఈ కాలపు పెరుగుదలంతా పెరుగుదల కన్నా ఎక్కువ మొరుగుదలకు, పరుగుదలకు చెందింది.

విద్యంతా కల్చర్‌తో మొదలవాలి కాని, క కా కి కీ, గ గా గి గీలతో కాదు.

అదేమిటో కాని ఈ దేశంలో స్వేచ్ఛ ఎక్కువగా కోరబడుతుంది కాని
తీసికోబడదు, గుర్తించబడుతుంది కాని గౌరవించబడదు.

ఈనాటి విద్యార్థులు విద్యాలయాలకు పోయేది విద్యలకొరకనుకుంటున్నారా మీరు? కాదు కాదు, చాలావరకు వియ్యాలకు, వినోదాలకు, విలాసాల కొరకు.

“గెలిచే ముక్కలు చేతులున్నపుడు పేకాట నిజాయితీగా ఆడాలి” అంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

ఇపుడీ దేశంలో సెక్యులరిజం కన్నా పెక్యులరిజంది, ట్రిక్కులరిజంది జోరెక్కువ, హోరు.

మనుషుల్లో కొందరు వాక్యామృతాలయితే కొందరు క్రియామృతాలు, కొందరు ఏమీ కాని వట్టి తప్పా తాలూ.

మనకీ రోజుల్లో ఒకరిని ఒకరనుకుంటే వారు మరొకరిగా బయటపడుతున్నారు
ఇంత త్వరగా "ప్యారడాక్స్‌కు" ఇంత గిరాకీ వస్తుందని ఎవరనుకున్నారు?

బీహార్‌లో మీరు ఎంత రంగ! రంగా! అన్నా ఏదీ కదలదట ఒక్క గంగ తప్ప.

ఒకపుడు ఋషులు పోయేవారు కొండలకు
ఇపుడపుడపుడే పెళ్లి చేసికొన్న ఖుష్ ఖుష్‌లు.

ఈనాటి నాగరికతంతా యథార్థాలకు చెందింది కాదు, పదార్థాలకు.

ఎవరైనా ఆంగ్లేయులు 'ఆహా! వాతావరణమెంత బాగుంది' అని ఏ స్త్రీతోనైనా అంటే,
దాని వెనకార్థం ఆహా! మీరెంత బాగున్నారు"! అని
స్త్రీలూ! జాగ్రత్త మరి, వాతావరణమేననుకొని మోసపోయేరు.

కొందరి కొందరి జీవితాల్లో మనకు ఏ అతుకూ కనిపించదు, ఏ వెతుకూ.
ఏదో ఒక బతుకు దెరువుకు చెందిన గతుకు తప్ప.

అందరినీ "ఆచార్యులు" అని సంభోదించకు ఒక్క బోధించేది ఆచరించేవారిని తప్ప, అందరినీ అలా సంబోధించి అసలు వారినవమానించకు.

రాజకీయాలకు వట్టి లెక్కలు తెలిస్తేనే చాలదు పక్కలు కూడా తెలియాలి,
రాజకీయ నక్కలు కూడా.

రాజకీయాలలో నెగ్గాలంటే "ఓపికతో చాలా ఓపికుండాలంటారు" పీ.వీ.గారు.

ఈనాటి సంగీత కచేరీ జరుగుతున్నప్పుడు మీరెంతైనా గోల చేయొచ్చు. ఈనాటి సంగీతమే ఒక గోల చాల.

ఇపుడు కల్లు కున్నంత గిరాకీ ఇల్లుకూ లేదు, ఇల్లాలుకూ లేదీ దేశంలో.

ఒకప్పుడు మన పల్లెలన్నీ పంటలకు ప్రసిద్ధి, ఇపుడు తంటలకు, ఉగ్రవాద మంటలకు.

ఈనాటి నాగరికతలో తేనెటీగలకన్నా ఈగలది జోరెక్కువ, జోర్రీగలది.

ఈ దేశంలో సెక్యులరిజం ఇపుడు నిచ్చెనెక్కి అరవడంలో తప్ప
నిజ జీవితంలో దివిటీ పట్టుకొని వెదకినా ఆగపడదు మీకెక్కడా.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు సాహిత్య జనులు, ఇపుడంతా అంతటా సాయిత్య జనులే.

ఈ దేశంలో ఇపుడు అన్ని గౌరవాలకన్నా ఆత్మ గౌరవాలదే అట్టడుగు స్థాయి.

ఈనాటి చదువులన్నీ మస్తకాల చదువులకన్నా ఎక్కువ పుస్తకాల చదువులే.

ఈ దేశంలో ఉగ్రవాదులకే ఇపుడన్ని హక్కులు
తక్కినవారికందరికి దక్కేవి చిక్కులే అనేవారు పి.వి. గారు.

'కమ్మ'వారు నిజంగానే కమ్మనివారు, మాటల్లోనే కాదు మూటల్లో, పాటుల్లో కూడా.

అదేమిటో కాని జనులు వృద్ధులవడానికైనా సిద్ధపడతారు కాని,
అభివృద్ధులవడానికి కారు.

అదేమిటో కాని లోకులు సంగీత కచేరి బాగా జరుగుతున్నపుడు ఏమిటేమిటో మాట్లాడుతుంటారు అదే పనిగా, జరగనపుడు మాట్లాడరు, అది చేయవలసినపుడిది, ఇది చేయవలసినపుడది చేస్తుంటారు.

ఈ దేశంలో ఇపుడు ఋణానికున్నంత గిరాకీ గుణానికీ లేదు, గుణవంతునికీ లేదు.

నేటి విద్యంతా ఉన్నతికన్నా ఎక్కువ ఉగ్రతకు, వ్యాఘ్రతకు దారి తీస్తోంది.

ఒకప్పటి రూపాయి విలువిపుడు బేడ, ఒకప్పటి మనిషికీ ఇప్పటి మనిషికీ కూడా
విలువల్లో అంతే తేడా.

రసవంతమైన భావాలు కలిగుండడం పని లేనివారి పనని అనుకుంటారు "పని మనుషులు"

ఈ దేశంలో తలలు చాలానే ఉన్నాయి కాని వాటిని దాచుకోవడానికి తావులు లేవు.

ఒకనాటి రాజమందిరమైన కింగ్‌కోఠీ, అయ్యయ్యో! అయిపోయిందిపుడు
ప్రతి లుంగోఠీకీ ఒక అంగోఠీ.

ఇపుడీ దేశంలో మనకు అన్ని వ్యాపారాల గురించి బాగా తెలుసు
ఒక్క తెలియవలసిన నీతి, నిజాయితీ వ్యాపారం గురించి తప్ప.

పరీక్షల్లో తెలిసేటట్లు వ్రాయడం కన్నా తెలివి తక్కువ పని మరొకటుండదు
అలా వ్రాసేవారు అట్టే తెలిసిపోతారు వారి పత్రాలు దిద్దేవారికి.

ఈ దేశంలో అభ్యున్నతి పేర జరిగే హంగామా కొండంత, జరిగేది కొసరంత.

ఆనాటి రాచరికంలో రాజులు దోచుకునేవారు, ఈనాటి "రాజకీయ రాచరికం"లో రాజకీయ రాజులు, రాజకీయ మా రాజులు.

మీరు సీటొక్కటడగకపోతే చాలు, మన బస్సుల్లో ఎంతమందైనా ఎక్కొచ్చు, నో లోటు.

పెళ్లి విడాకులే కావాలంటే అతి ధనవంతురాలిని చేసికో, పెడాకులే కావాలంటే అతి విద్యావంతురాలిని.

ఒక వకీలును అబద్ధాలఖోరు, ఒక విలేఖరిని త్రాగుబోతనడం కన్నా అతి వాస్తవ వాదం మరొకటుండదంటారు ఒక రచయిత.

ఈ రోజుల్లో ఎవరైనా ఏమైనా కావాలనుకుంటే అదంత సులభమైన పనేమీ కాదు. ఉసుళ్ళు కూడా ఊసర వెల్లులు కావాలనుకునే రోజులివి అంటారు పి.వి.గారు.

తృప్తి కావాలంటే బీదరాలిని చేసికో, భుక్తి కావాలంటే ధనవంతురాలిని, వము క్తి కావాలంటే రోజుకు మూడుసార్లు స్నానం చేసేదానిని.

ఈ రోజుల్లో ఎటు చూచినా తటస్థించేవారు మాయకులే,
మచ్చుకైనా తటస్థించరు మీకు అమాయకులు.

ఈ కాలపు ప్రేమంతా ఒక వల
"ప్రేమిస్తున్నాను", "ప్రేమిస్తున్నాను" అని చేసే ఒక గోలే కాదు, గోల గోల.

ఆ రోజుల్లో నెహ్రూగారిని చాలా ఉదారులని అనేవారట చాలామంది వారి ముందే
కాని బైటి కొచ్చి, "పండితులు మీరంటే చాలు, పట్టుకుపో పదివేల ఎకరాలు"
అని అంటూ. చైనీయులనడగండి వారే చెబుతారు మీరు అని అనుకునేవారట.

ఆహా! ఖయ్యాం! నీవు సిరాతో వ్రాసుండవు నీ "ఉమర్‌ఖయ్యాం"ను,
వ్రాసుంటావు తప్పక సారాతో. లేకపోతే అలా ఎలా కుదురుతుందది అక్షరాలా దానిలా?

తారలకు కూడా తల్లి కావాలనుంటుంది కాని పెళ్లి కావాలనుండదు, అదెలాగో?

ఇపుడు విద్యార్థులు విద్యాలయాలకు పోయేది విద్యల కొరకనుకుంటున్నారా మీరు?
కాదు, కాదు, విద్యా వేతనాల కొరకు (స్కాలర్ షిప్పులు), వియ్యాల కొరకు.

ఈ కాలంలో దేవుడు దర్శనమిచ్చినా ఈ దేశీయులకు ఇంగ్లీషులో మాట్లాడాలనుంటుంది కాని ఈ దేశ భాషల్లో కాదు, ఒక్క తమిళులకు తప్ప. వారికి మాత్రం తమిళంలోనే మాట్లాడాలనుంటుంది, ఆ తదుపరి ఇంగ్లీషులో.

సొసైటీని అదే పనిగా విమర్శించకు,
విన్నవారు సొసైటీలో నీకు చోటు లేదనుకుంటారు మరి.

పొరపాటున "ఒక కా'పు' కూడా రాష్ట్రపతి కావచ్చు"నని వ్రాశారు మనవారు
మన రాజ్యాంగంలో. ఇక చూడండి నా సామిరంగా! ప్రతి కాపూ ఆ కాపు నేనే కావచ్చునని పడికాపు కాస్తున్నాడు ప్రతి ఎన్నికల్లో దాని కొరకు.

ఈ రోజుల్లో ఒకరిని చూస్తే చాలు అందరిని చూచినట్లే అనిపిస్తోంది,
ఒక సినిమా చూస్తే అన్ని సినీమాలు చూచినట్లు, ఒక సీరియల్ చూస్తే అన్ని సీరియల్లు చూచినట్లు. ఎవరనుకున్నారు ఇంత త్వరగా మన వారు మిస్టరీ అంతా కోల్పోయి ఇలా కేవలం వట్టి హిస్టరీగా మిగిలిపోతారని.

ఈనాటి నాగరికతను చూడాలంటే క్రింది నుండి కాదు మీరు చూడాల్సింది
మీది నుండి. పగలు కాదు, రాత్రి.

ఎవరన్నారు మీతో మన ప్రభుత్వ రంగ సంస్థల నష్టాలన్నీ నష్టాలని?
కావు కావు, మన పరిపాలకుల అవినీతుల, అసమర్థతల అరిష్టాలు.

మనం మన దుస్తుల్లో ఎంత అధునాతనులమో
మన దృష్టి దృక్పథాల్లో అంత పురాతనులం, సనాతనులం.

మురుగు కాలువలకన్నా మురుగు బుర్రలు మరెంత ప్రమాదకరం అనేవారు పాల్కీవాలాగారు.

సంచి పెరగడం మంచిదే కాని, మంచితోపాటు పెరగడం అంతకన్నా మంచిది.

ఓటు వేయడమే ప్రజాస్వామ్యానికి ఓటువేయడమనుకుంటారు కొందరు, కాని కాదు కాదు,
ప్రజాస్వామ్యానికి ఓటు వేయడమే అవుతుంది కాని ఇతరత్రా కాదు.

మనం ప్రకృతి వలన, మన పాలసీల వలన ధనికులమే కాని
మన క్రమశిక్షణ లేమి వలన బీదవాళ్ళమవుతున్నాం అని అనేవారు పాల్కీవాలాగారు.

ఈనాటి విద్యంతా అది కొంతా, ఇది కొంతా, అదొక అనేకానేక అతుకుల బొంత.

ఈ రోజుల్లో అందరూ విద్యావంతులే కాని
వారికే తెలియాలి వారిలో అది ఎన్నివంతులో.

పరాయి భాష ద్వారా నేర్చుకునే విద్యతో పరాయి భాష నేర్చుకునేవరకే
పళ్ళూడిపోతాయి జాగ్రత్త మరి.

మన దేశంలో ప్రతి రోజటి మొక్కు బడి "సత్యమే విజయతే"
తొక్కుబడి మాత్రం "అసత్యమే విజయతే."

ఈనాటి నాగరికతను చూడాలంటే చూడాలి మీరు ఈ కాలపు డ్రెస్సుల్లో, కిస్సుల్లో, మెస్సుల్లో.

లండన్‌లో మీరు తిరుగుబోతులే కాకపోతే అరుగు బోతుల క్రింద లెక్కకడతారట జాగ్రత్త మరి.

ఈ రోజుల్లో ఎటు చూచినా మనకు తటస్థించేవారు అయితే తెలివికలవారు లేకపోతే అతితెలివికలవారు, మచ్చుకైనా కనిపించరు మనకు తేట తెల్లనివారు.
ఎవరనుకున్నారు ఇంత త్వరగా తెలివిచట ఇంత చౌకబారవుతుందని?

దౌత్యులంటే అబద్ధాలను నిజాలుగా, నిజాలను అబద్ధాలుగా నిరూపించే వరకు నిద్రపోనివారట.

స్త్రీలకు వారి సరదాలపై పరదాలెలా వేయాలో తెలియదు. అయిదంకాల నాటకం అయిపోయాక కూడా ఆరో దాని కొరకు నిరీక్షిస్తూనే ఉంటారంటారు ఆస్కార్‌వైల్డ్ గారు.

"పురుషులకన్నా స్త్రీలెంతో తెలివి కలవారు. ఎపుడెప్పుడు పురుషులు ప్రేమ గురించి మాట్లాడుతారో, అపుడపుడు వారు పెళ్ళి గురించి ప్రస్తావిస్తారు," అంటారు ఆస్కార్‌వైల్డ్‌గారు.

అతి ధనానికి, అతి అవినీతికి గల సంబంధం భార్యా భర్తల సంబంధం లాంటిది.

పత్రికల వారంటే పర పతి లేనివారికి పరపతి కల్పించి పరపతి ఉన్నవారి పరపతి తీసేవారట.

కొందరు చెప్పినవే చెప్పీ చెప్పీ వాటినంతం చేస్తారు, కొందరు చెప్పేవారికే చెప్పీ చెప్పీ వారిని.

"ఒకప్పుడీ దేశంలో కొడుకులెక్కువ పుట్టేవారు
ఇపుడల్లుళ్ళు, అదీ ఇల్లుటపు అల్లుళ్ళు" అని అనేవారు స్వామీ రంగనాథానందగారు.

దైవం అచటచటా, "దొంగలున్నారు జాగ్రత్త"! యను "గమనిక ఫలకాలను" చూస్తాడేమో అందుకే కనబడకుండా తలదాచుకొని తిరుగుతాడు తప్పించుకొని.

చాలా మంది వారి పెట్టుబళ్ళను వచనాల్లో పెట్టి దివాలా తీస్తారు
కవితల్లో పెట్టి  తీసినా కాస్త ఖదరైనా దక్కేది.

వ్యవహారం గురించే అదే పనిగా మాట్లాడితే వెనకబడిన వారనుకుంటారు జాగ్రత్త మరి!

ఆడవారు చూడడానికి బాగుంటారు కాని వినడానికి వారికి వారే సరిపోతారు.

పోయీ పోయీ పట్టణమే పోవాలా సంస్కారం కొరకు?
పోతే పోవచ్చునేమో సరుకుల కొరకు, సరదాల కొరకు, సంబరాల కొరకు కాని.

కొందరు కృతజ్ఞతను అదేపనిగా కృతఘ్నత అంటుంటారు.
ఎందరో మహానుభావులు అందిరికీ వందనాలు.

ఈనాటి శిక్షణంతా శిక్షణకన్నా ఎక్కువ దక్షణ కొరకు
దక్షణకన్నా ఎక్కువ భక్షణ కొరకు.

ఈనాటి జీవితాలన్నీ ఎలక్షన్లతో ముడిబడున్నాయి, వాటి కొరకు కలెక్షన్లతో.

అదేమిటో కాని, చాలా మంది బిషపులు వంగిపోతోన్న ఓడల్లా, కృంగిపోతోన్న గోడల్లా అనిపిస్తారు, కనిపిస్తారు. బహుశః వాగీ వాగీ, కాగీ కాగీ, త్రాగీ త్రాగీ అలా అయిపోతారేమో.

మీకు Law తెలిస్తే చాలు, ఎన్నైనా చేయొచ్చు మీరు గస్లాలు.

మగవారు ఆడవారిని వస్తువులుగా చూస్తారు, ఆడవారు మగవారిని ఆట వస్తువులుగా.

ఇండియాలో కొలలతో అవుతాయి పెళ్ళిళ్ళు, అమెరికాలో వలలతో.

అందమైన అవినీతి కూడా అందమైన వస్తువుల్లా ధనవంతులకు చెందిందే.

"ఆహా ఏమి విద్య మనదిది!
వ్యాపారులనూ విద్యావేత్తలనూ ఒకటే చేస్తోంది" అంటారు ఆస్కార్‌వైల్డ్‌గారు.

ఒకడు ఒక పార్టీలో ఉన్నంత కాలం అతనిని ఆ పార్టీ వారు మనిషిగా చూస్తారు, అతడా పార్టీ మారిస్తే చాలు 'పనిమనిషి'గా.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు ఒకప్పటి లాంటి స్నేహితులు, సన్నిహితులు.
ఇపుడంతా అంతటా వట్టి ఊకదంపుడు హితులే.

ఇపుడు మనకు దారులకన్నా పక్కదారులెక్కువ
రహదారులకన్నా రంకుదారులు, బొంకుదారులు.

ఇపుడు మన ప్రభుత్వ రంగ కార్యాలయాలన్నీ మన పరిపాలకులు
అడపాదడపా అతిథుల్లా వచ్చి పోయే అతిథి గృహాలు.

ఇపుడు "బీరు"కున్నంత గిరాకీ ఈ దేశంలో "షేరు"కూ లేదు, "పీరు"కూ లేదు.

ఈనాటి పెళ్ళిళ్ళకు కావాలసింది ఒకే ఒక గ్రౌండ్, డాలర్ల బ్యాగ్రౌండ్.

స్త్రీయొక్క అందమంతా ఆమె సిగ్గులోనే ఉంటుంది, అదే ఇపుడు వారిలో తగ్గే కాదు, అతి తగ్గు.

ఈనాటి ప్రేమంతా ఒక గాలం
చేపపడేవారికే ప్రేమ, పడితే ఇంకేముంది అయిపోతుంది ఓమ.

మన సినీమా నిర్మాతలకు గామాకు డ్రామాకు తేడా తెలియదు,
దానిని ఇది దీనిని అదనుకొని సినిమాలు తీస్తారు.
అందుకే మన సినీమాల్లో గామాలది అంత హంగామా.

ఇపుడీ దేశంలో ఒకే ఒక నీతికి భలే గిరాకీ, అవినీతికి.

"పాపం పంచశీల"! చైనీయుల పుణ్యమా అంట ఎప్పుడో అయిపోయిందది వంచశీల.

మొదట్లో మనమే లేపుతాం దుమారం, ఆ పిదప మనమే అవుతాం దానిపై గరం గరం.

విద్యల్లో కొందరు తల్లిదండ్రులది షార్ట్ సైటయితే,
కొందరిది లాంగ్ సైట్. కొందరిది తెలిసీ తెలియని ఏదోఒక ఫైట్.

ఈనాటి రాజకీయాల్లో ఎవడెన్ని అపవాదాలు లేవదీస్తే వాడు అంత సితార,
ఎవడెంత దుమారం లేపితే వానిది అంత పతార.

ఇపుడెక్కడ లభిస్తాయి మీకు ఒకప్పటి లాంటి ట్రేడ్ యూనియన్లు
ఇపుడంతా అంతటావాటి పేరట ట్రేడింగువే.

తలవ్రాతలే బాగులేకపోతే తలకట్టులు మాత్రమేంచేస్తాయి పాపం!

బొద్దు స్త్రీలకు ముద్దు స్త్రీలకు హద్దులుండవంటారు, జాగ్రత్త మరి.

మామూలు ఉద్యోగుల్లో మనకు తటస్థించేవి
వారి షరామామూలైన " మామూళ్ళే".

ఒక స్త్రీ మాట్లాడితే మాతృక, ఇద్దరు మాట్లాడితే పత్రికట.

వధువు కావాలి అమెరికా వారికి, వరుడు కావాలి ఇండియావారికి.
ఇచటి వారికి అచటి వారు పట్టరు, గిట్టరు. అచ్చటి వారికి ఇచ్చటి వారు గిట్టరు.

కొందరేమి చెప్పినా బాగుంటుంది, ఒక్క వారు చెప్పాల్సిన పాఠాలు తప్ప.
కొందరివేమి విన్నవించినా బాగుంటుంది ఒక్కవారు విన్నవించే విన్నపాలు తప్ప.

ఇపుడు ఓటుకూ నోటుకూ ముడే కాదు కటికె ముడి.

ఈనాటి చదువలన్నీ అయితే ముల్లె కట్టడాలు లేకపోతే వల్లె వేయడాలు.

ఎవరన్నారు బ్రదర్ నీతో, నీవూ నేనూ కూడా ఈ ప్రజాస్వామ్యంలో
లెక్కకొస్తామని, ఒక్క ఎన్నికల్లో తల లెక్కలకు తప్ప?

ఒకపుడు అవినీతి అంటే ఈ దేశంలో అందిరకీ ఒక భీతి
ఇపుడదే అయిపోయింది అసలు సిసలైన నీతి, రీతి.

ఈనాటి విద్యంతా మనుషులకన్నా పనిమనుషులనెక్కువ
పనిమనుషులకన్నా మనీ మనుషులనెక్కువ పుట్టించుటకు అక్కరకొస్తోంది.

గొప్పవారెవరంటే, గొప్పల గురించి వారే చెప్పి చెప్పి వారే తప్పువారు.

పన్నులు నాగరీకతల వెన్నులు, పన్నులే రాబట్టుకోకపోతే పరిపాలకులవుతారు ఖిన్నులు,
తింటారు తన్నులు అనేవారు పఠాభిగారు.

Ceylonలో ప్రతి నారీ ఎవరినో ఒకరిని క్యారీ చేయకుండా బైటికి పోదట, ఏ ఒయ్యారీ!

కొందరి కొందరి జీవితాల్లో మీకు ఏ ఫీలింగ్సూ కనబడవు ఏవోకొన్ని లీనింగ్సు తప్ప.

మీకీ దేశంలో ఓట్లే కావాలంటే కావలసింది ఓటర్లు కారు
వారిని ప్రోగు చేసే floaterలు, bloaterలు, quoterలు.

సత్యమే చెప్పాల్సి వస్తే
వ్యవహారదారులందరూ అయిపోతారు వ్యవసాయదారులు.

ఎవరైతే ఎప్పుడూ 'చుస్తుగా', 'మస్తుగా' వస్తు వాహనాల గురించే దుస్తులు ఆభరణాల గురించే మాట్లాడతారో చూడండి మీరు తక్కిన వాటిల్లో వారు "సుస్తులు".

ఎచటున్నారిపుడు ఒకప్పటి లాంటి తిరుగుబాటు దార్లు
ఇపుడంతా అంతటా వ్యాపారులు, దళారులే.

మనిషి ఒంటరిగా ఉంటేనే మోతి, పదుగురిలో ఉంటే కోతి, చుప్పనాతి.

విద్యల్లో అతి ముఖ్యమైన విద్య వేద విద్య
అయ్యయ్యో! అయిపోయిందిపుడు అదే అన్నిటికన్నా అతి పేద విద్య.

మన విశ్వవిద్యాలయాలన్నీ ఒకపుడు విషయ దృష్టికి ఆలయాలు
ఇపుడు చాలా వరకు విషదృష్టికి.

ఆశావాదులంటే భూతద్దాల ద్వారా చూచేవారు, నిరాశావాదులు పూతద్దాల ద్వారా.

"రాజకీయాలు వర్ధిల్లాలంటే ప్రజాస్వామ్యంలో ఎన్నో కొన్ని మురికి గుంటలు
ఎప్పుడూ మిగిలుండాలి" అంటారు సామర్‌సేట్ మాఘమ్‌గారు ఒక పుస్తకంలో.

"నేను ఇంగ్లాండ్‌లో ఏ మార్పూ కోరను ఒక్క వాతావరణ మార్పు తప్ప,
అదెలాగూ మారదు" అంటారు ఆస్కార్‌వైల్డ్‌గారు.

కొందరు అన్నీ చెబుతారు ఒక్క వారు చెప్పవలసింది తప్ప,
కొందరు అన్నీ వింటారు ఒక్క వారు వినవలసింది తప్ప.

ఇపుడు "గిల్లుకు" 'కల్లు'కున్నంత గిరాకీ "చెల్లు"కూ లేదు, "లల్లు"కూ లేదు.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు ఒకప్పటి లాంటి పుస్తకాల జనులు, ఇపుడంతా అంతటా పాఠ్య పుస్తకాల జనులే.

మనిషిని చంపితే నేరం, పులిని చంపితే వినోదమట. అదెందుకో? ఎలాగో?

ఈ దేశంలో అన్నతమొకప్పుడు అపశృతి, ఇపుడక్షరాలా శృతి.

ఈ రోజుల్లో మతం కొందరికి passion అయితే, కొంతమందికి fashion.

"అందం గురించి తప్ప ఆడవారికి చెప్పేదేదీ అంతగా ఉండదు,
అదెలాగూ దానికదే చెప్పేస్తుంది వారు చెప్పాల్సిన పని లేకుండా". అంటారు ఆస్కర్‌వైల్డ్ గారు.

జీవితాలలో కొందరు పున్నమలకు వారసులయితే, కొందరు అమావాస్యలకు.
కొందరు వికాసాలకు వారసులయితే, కొందరు విలాసాలకు, వినోదాలకు.

"ఆడవారిని ఆరాధించాల్సిందే కాని అజమాయిషీ చేయగూడదు,
ఆజమాయిషీ చేస్తే ఇంకేముంది అతలాకుతలమయిపోరూ! మొదలే అబలలు వారు"
అంటారు ఒక రచయిత.

ఈ శతాబ్దం యొక్క జపం ధనం, దానికొరకే ప్రతివాడూ ప్రతిచోటా, ప్రతిదినం సిద్ధం, యుద్ధం.

మొదట "సారా"ను నీవు సేవిస్తావు, ఆ పిదప సారా నిన్ను.

ఆ మాటకొస్తే వ్యభిచారిణిని మించిన మంచి ఆచరిణి మరొకరుంటారా? అంటారు ఒక రచయిత.

ఒకప్పుడు "దొరసాన్లు" ఉండేవారీ దేశంలో ఎక్కువగా
ఇపుడు వారి స్థానే సినీమాలకు చెందిన ధర-సానులు.

డ్యాండీస్ అంటే ఎవరో తెలుసా? మధ్యాహ్నం రెండు గంటల వరకు లేవక క్లబ్బుల్లో తప్ప మరోచోట కనబడనివారట.

ఎలెక్షన్లలో ఓట్లన్నీ నోట్లపై ఆధారపడుంటాయి, కోట్లపై.

అదేమిటో కాని వృత్తుల్లో, కళల్లో, పదవుల్లో serious గా విజయాలు సాధించినవారంతా వారి నిజ జీవితాల్లో 'curious'గా అగపడతారు, 'furious'గా.

కొందరికి పార్టీలు మార్చడానికి, వారి లంగాలు లుంగీలు మార్చడానికీ తేడా లేదు ఈవెన్ బెడా.

ఒక్క చెక్ బుక్ చేతిలో వుంటే చాలు
అమెరికా అమ్మాయిలు ఆసాంతం అమెరికానే కొనేస్తారట మరి.

ఇపుడీ దేశంలో పిల్లలెవ్వరూ తటస్థించరు మీకు
అంతా అంతటా చక చకా సాగే చలాకీ ఎల్లలు, కొల్లలే.

ఈనాటి Friends నాలుగు రకాలు
గర్ల్ ఫెండ్స్, బాయ్ ఫ్రెండ్స్, చాయ్ ఫ్రెండ్స్, హాయ్ ఫ్రెండ్స్.

ఆహా! పల్లెటూరా! నీవెంత మారిపోయావిపుడు నా ఒకప్పటి మయూరా!
ఇపుడు నిన్ను సినిమాల్లో తప్ప మరెచటా చూడలేము నా ప్యారా!

"సినీమాల్లో కలిసి వచ్చిన వాడు 'వాసన్', కలిసిరానివాడు ఉపవాసన్," అంటారు పఠాభిగారు.

నోరు పారేసుకోవడంలో మన దక్షిణాదివారిని మించిన మొనగాళ్ళ మరొకరు ఉండరట.

ఎత్తు చెప్పులు (లేడీస్‌వి) కొందరికి హొత్తులు మత్తులయితే, కొందరికి అడుగడుగునా చిత్తు చేసే ఒత్తులు.

మీరు అంగీకరించండి అంగీకరించకపోండి కాని
నాకు మాత్రం భారతీయ స్త్రీ "సారీ"లోనే "ప్యారీ" అనిపిస్తుంది.
తక్కినవాటిల్లో అడగకండి నన్ను, I am sorry.

జనతాపార్టీలో ప్రత్యర్థుల తలకొలతలపై తగాదాలకన్నా
వారి తలకొలతలపై తగాదాలే ఎక్కువట వారిలో వారికి.

ఇపుడు లోకులు పొగిడేది 'మనిషి'ని కాదు
మనిషి వెనకాల దాగున్న ధన-మనిషిని, ఘన - మనిషిని.

మనకు సంగీత సాహిత్య విద్యల్లో కనబడే చాలా మంది పెద్ద మనుషులు
వారి కళల్లోనే పెద్ద మనుషులు కాని వెలల్లోకాదు, కాదంటే కానే కాదు.

జీవితంలో అంతా తెలిస్తే జీవితం యొక్క "మజా" పోతుంది, "తాజా".

వరపూజ అయాక పెళ్ళి చాలానాళ్ళాగితే, వరునికేదో మూడిందనుకుంటారు జాగ్రత్త మరి.

ఎవడు ఒకే ఒక సారి తింటాడో వాడు యోగి, రెండుసార్లు తింటాడో భోగి, మూడుసార్లు తింటాడో రోగి అంటారు శంకర నారాయణగారు.

ఈ రోజుల్లో ఒకరు మరొకరి వద్దికి "బాగున్నారా మీరు" అని ఊరకే చూడడానికి పోవడమే ఎంత అరుదయిందంటే, ఎవరైనా అలా తప్పిపోయి పోతే "ఎటొచ్చారు" అని అడుగుతారు ఆ ఇంటివారు రాగూడనివారెవరో వారింటికొచ్చినట్లు.

"ఎన్నాళ్ళయిందో పూలను చూచి, ఈ రోజు వాటివైపు చూస్తే,
అయ్యయో! మనుషుల్లా మారిపోయాయి" అవి అని అంటారు ఒక రచయిత.

అదేమి చిత్రమో కాని అందమైన వారికి అందమైన వారు దొరకరు పెళ్ళాడడానికి ప్రతిభ కలవారికి ప్రతిభ కలవారు. వారికి వీరు, వీరికి వారు దొరుకుతారు.

ఒకప్పుడు రెండే రెండు తెగలవారుండేవారీ దేశంలో, ఒకరు తెలిసిన వారు, ఒకరు తెలియనివారు. ఇపుడు వారిరువురినీ మించి పోతున్నారు తెలిసీ తెలియనివారు.

సత్యమెప్పటికీ సగమే అబ్బుతుందట మనిషికి, సాంతమబ్బితే అతడిక చాలని కూర్చుంటాడని.

ఎపుడైతే మనం ఒకరిని నచ్చమో
వారికి ఏదో ఒక అపవాదాన్నైనా అంటకడతాం, అవినీతినైనా.

బ్రహ్మచర్యం వలన బ్రహ్మచారులకు లేదేదీ బాధ, బాధంతా భామామణులకే.

ఈ కాలంలో ఆకతాయిగాళ్ళు, ఆవారాగాళ్ళే ఎంత సంసారుల్లా, సంస్కారుల్లా నటిస్తున్నారంటే, అసలువాళ్ళే అవాక్కయిపోతున్నారు వారిని చూచి, ముఖం వాచి.

ఖైదీ వస్త్రాల్లో కనబడేవారు చిన్న దొంగలయితే, ఖాదీ వస్త్రాల్లో కనబడేవారు పెద్ద దొంగలంటారు శ్రీశ్రీగారు.

మన నేతలంతా ఇంట కుల నిర్మాణ కూతలు, బైట కుల నిర్మూలనా ప్రేతలు.

ఈరోజటి పెళ్లి కొడుకులకు, అటు అందమూ కావాలి, ఇటు అర్థమూ కావాలి, అటు సంస్కారమూ కావాలి, ఇటు సంఘస్థాయీ కావాలి, ఇప్పిస్తే ఉద్యోగమూ కావాలి, తెప్పిస్తే ప్రమోషనూ కావాలి, పంపిస్తే పరాయిదేశాలూ కావాలి, కొనిస్తే కార్లూ బంగ్లాలు కావాలి, చదివిస్తే పెద్ద చదువూ కావాలి, లిటిగేషన్లేవయినా ఉంటే అవి settle చేయించాలి, గ్యారంటీ ఏదైనా అవసరమైతే గ్యారంటారుగా నిలవాలి.

ఈనాటి సినీమాలకు, రాజకీయాలకు తేడా లేదు ఈవెన్ బేడా.
అందుకే సినీమాల నుండి వలస వస్తున్నారు రాజకీయాలకు చాలామంది.

ఈ దేశంలో మనం ఎన్నిటినో నేషనలైజ్ చేశాం కాని
చేయవలసిన ఒక్క నేషనలిజాన్ని మాత్రం చేయలేదు అప్పటికీ, ఇప్పటికీ.

రాజకీయాలలో పనిచేస్తూ తేట తెల్లగా ఉండాలనుకోవడం, బొగ్గు గనుల్లో పనిచేస్తూ తెల్ల బట్టలు నల్లబడగూడదనుకోవడం లాంటిదంటారు పీ.వీ. గారు

రాజకీయాలలో ఎప్పుడూ ఎవడో ఒకడు మరొకన్ని చిన్న దొంగో పెద్ద దొంగో, కోడిదొంగో, కోడిగుడ్డు దొంగో అంటూనే ఉంటాడు, తానూ వారిలో ఒకడవుతూ కూడా అంటారు పీ.వీ.గారు

పెళ్ళిళ్లలో కొందరిది క్యాచింగ్ కాని ట్రాజెడీ అయితే, కొందరిది మ్యాచింగ్ కాని ట్రాజెడీ, కొందరిది హ్యాచింగ్ కాని ట్రాజెడీ.

బీహర్‌లో "వార్" అంటే తప్ప "సార్" అంటే ఏ పనీ కాదట, ఖబర్దార్!

ఈ రోజుల్లో "భంగు"కున్నంత గిరాకీ ఏ హంగుకూ లేదు, ఫిరంగుకూ.

కమ్యూనిస్టులకు వారి తాతలంతా కోతులే (వారినలా చూస్తారు నేరస్తుల్లా), వారి నుండి వారెలా మనుషులై పుట్టారో వారికే తెలియాలి మరి చుప్పనాతులు.

మీకు పొగడ్తలే కావాలంటే అడగండి అవతలివారిని, అగడ్తలే కావాలంటే ఇంటివారిని. ఇంటివారెప్పటికీ మీకు కుంటివారే.

గాంధీగారి పుణ్యమా అంట ఈ దేశానికి ఒక దేశమంటూ వచ్చింది కాని
మన పరిపాలకుల పుణ్యమా అంట ఒకప్పటి రేశం మాత్రం ఆ కాస్తా కారిపోయింది.

ఇపుడెక్కడ లభిస్తారు మీకు ఒకప్పటి లాంటి బుక్కుల జనులు, ఋక్కుల జనులు, ఇపుడంతా అంతటా కుక్కుల, ట్రిక్కుల, చెక్కుల, మెక్కుల జనులే.

ఎవరు దూలాల్లా కనిపిస్తారో వారు కలవారు, ఎవరు వాసాల్లా కనిపిస్తారో వారు వెలవారు.

మద్యం మోతాదుగా సేవిస్తే మోజు, మోతాదు దాటితే ఇంకేముంది. సేవించినవాడవుతాడు లూజులూజు, టీజు టీజు.

ఈ దేశంలో వెన్నులు మోగందే పన్నులు రాలవంటారు పఠాభిగారు.

ఈ రోజుల్లో మగవారెవ్వరో ఆడవారెవ్వరో తేల్చుకోవలసింది వెనక నుండి చూచి కాదు, ముందు నుండి చూచి.

ఇపుడెక్కడ లభిస్తారు మీకీ దేశంలో "చక్కటి" "చిక్కటి" జనులు,
ఇపుడంతా అంతటా కుక్కెటి, తొక్కెటి, చెక్కెటి జనులే.

ఇపుడు శాసన సభ్యులు కూడా దొరుకుతారు మీకు అమ్మకానికి అంగళ్ళలో గొంగళ్లలా.

ఈనాటి విద్యాలయాలలోని చదువులన్నీ చాలా వరకు చదువుకోవడాలకన్నా ఎక్కువ చదువు కోరడాలు, కొనడాలు.

ఇపుడీ దేశంలో ఎలక్షన్లు వస్తే చాలు ప్రతిచోటా లక్షలది, కోట్లది కలెక్షన్లదే హడావిడి.

ఈనాటి చాలా మంది ఉపాధ్యాయులు ఉప - అధ్యాయులే.

ఇంత భిన్నత్వం కల దేశాన్ని పరిపాలించాలంటే అండ కాదు కావాలసింది డండ కూడా చేతిలో ఉండాలి అంటారు గిల్‌గారు.

పుష్పాలకు మరేమీ పనుండదు పూయడం తప్ప, పుష్పవతులకు లాగా.

ఈనాటి మతస్థుల్లో విశ్వాసాలకన్నా విశ్వాసస్తులపైనే తగాదాలెక్కువ.

సత్యమెప్పుడూ మనను సతమతపరుస్తూనే ఉంటుంది, అందుకే దానిని అమెడ దూరముంచుతాం మనమెప్పుడూ.

ఎవ్వరూ ఈ కాలంలో దీర్ఘ కాల ఎంగేజ్‌మెంట్ జోలికి పోగూడదు, కాలం దీర్ఘిస్తే కాలుజారే ప్రమాదముంటుంది జాగ్రత్త! మరి.

ఈనాటి ప్రభుత్వరంగ చికిత్సాలయాలన్నీ భూమి మధ్యా నరకం మధ్యా కొట్టుమిట్టాడుతున్న నిరీక్షణాలయాలు.

జపాన్‌వారు వారి భావాలతో బొంగరాలాడుతారు, భారతీయులు వారి అహంభావాలతో.

స్త్రీలు అందరినీ అర్థం చేసుకుంటారు, ఒక్క వారర్థం చేసికోవాల్సిన వారి భర్తలను తప్ప.

"ఆధునిక ధనవంతుల ధనానికి ప్రధాన కారణం ప్రైవేట్‌గా సేకరించిన ప్రభుత్వ రహస్యాలను పబ్లిక్‌గా వాడుకోవడం" అంటారు ఆస్కార్ వైల్డ్‌గారు.

ఈనాటి నాగరికతలో మనకు ఎక్కువగా తటస్థించేవారు భ్రమరాలే. అయితే పరభ్రమరాలు, లేకపోతే స్వ-భ్రమరాలు.

ఈ దేశంలోని చాలా మంది ఇపుడు మాటల్లోనే నయాగారాలు కాని చేతల్లో సహారాలు.

సినీమాల్లోలాగే రాజకీయాల్లో, వ్యాపారాల్లో తుదకు మిగిలేవారు ఎవరికి వారే యమునా తీరే లాంటి వారే.

పాశ్చాత్యులకు అర్థంపై మోజెక్కువ, మనకు వ్యర్థంపై, స్వార్థంపై.

జపానులో భావాలతో బొంగరాలాడుతారు, అమెరికాలో దావాలతో.

ఒకపుడు విద్యంతా "fount"లను పుట్టించుటకు అక్కరకొచ్చేది, "count"లను ఇపుడు అకౌంటెంటులను.

ఈనాటి క్రొత్తగా ఆవిర్భవించే పార్టీలన్నీ కుక్క గొడుగుల్లా అవతరించి కుక్క గొడుగుల్లా అడుగంటేవే.

పురుషులు స్త్రీలను కళ్ళతో ప్రేమిస్తారు, స్త్రీలు పురుషులను చెవులతో.

ఈ దేశంలో గుడికి పోయేవారంతా గుడి దాటితే అంగడంగడి, గొంగడి గొంగడే.

ఈ కాలంలో బడికి పోయే వారంతా బడిదాటితే చాలు విచ్చలవిడే.

తరచి చూడండి మీరు, ఛలోక్తి తెలిసిన వాడే తుదకు చలో - యుక్తి కూడా తెలిసినవాడవుతాడు జీవితంలో.



## APPLIED HUMOUR

**నేను బి. ఏ.** (Bachelor of Arts) **నన్నాడటాతడు.**
పోవోయ్, పో ! నీవు బి.ఏ. వయితే, నేను బి.బి.ఏ.ను
(Bachelor of Brandy Arts) అన్నాడటీతడు.

రాబోయేది **EMSET** అన్నాడటాతడు.
LIMSET (Leak Technology) తెలిసినవానికి EMSET ఆవకాయపచ్చడన్నాడటీతడు.

**అవును నిన్నొస్తానని ఇవ్వాళ్ళొచ్చావేం అన్నాడటాతడు.**
ఓహెూ ! ఇది ఇవ్వాళ్ళా, నేను నిన్ననుకొని వచ్చానన్నాడటీతడు.

**సాహిత్యంలో వారూరకే పోట్లాడుకుంటారేమిటన్నాడటాతడు.**
దుకాణాల్లో వారి పుస్తకాలు పోట్లాడక పోవడం వలన, రికానాల్లో పోట్లాడతారు వారు అలా అన్నాడటీతడు.

**చస్తానంటుందన్నాడటాతడు.**
ఇస్తానంటేనే ఇవ్వదు చస్తానంటే ఎలా చస్తుందది అన్నాడటీతడు.

**అపుడపుడూ కనబడుతుండవోయ్**
**కనబడితే కనమెరుగు, కనపడకపోతే కనుమరుగు అన్నాడటాతడు.**
కనపడితే 'కరసం', వినబడితే 'విరసం', ఉంటేగా 'సరసం' అన్నాడటీతడు.

ర-మ్మంటుంది, అన్నాడటాతడు.
రమ్మా! రమ్‌అంటే (RUM) పిలవాలా, నేనేరానూ ! అన్నాడటీతడు.

పెళ్ళిచేసికుంటున్నారా? అని అడిగాడటాతడు.
పెళ్లాంకొరకు కాదోయ్, పెట్టుపోతలకొరకోయ్! అన్నాడటీతడు.

ఆవిడ ముఖం చూస్తే చాలు, అంతే, అన్నాడటాతడు.
అందుకే ఆవిడ పేరు 'శ్రీముఖం' అని పెట్టారన్నాడటీతడు.

అద్దెకుంటున్నావా ? అని అడిగాడటాతడు ఆశ్చర్యపోతూ.
అద్దెకొరకు కాదోయ్ 'అమ్మ' కొరకన్నాడటీతడు.

ముఖం మొత్తిందన్నాడటాతడు.
ఉంటేగా మొత్తడానికన్నాడటీతడు.

నేను బజార్ కెళ్తానన్నాడటాతడు.
అచటి నుండేకదా వస్తున్నావు అన్నాడటీతడు.

మీ ఊళ్ళో అంతటా గాడిదలే అన్నాడట విశ్వనాథ వారితో ఒకడు.
మావి తక్కువే, బైటివే ఎక్కువ అన్నారట విశ్వనాథ వారు.

అయినా ! అంత బంగళా ఎందుకోయ్ అతనికన్నాడటాతడు.
ఇంట్లో ఎప్పుడూ ఏదో 'భజన', దాంతో ఎప్పుడూ ఏదో 'విభజన'
అందుకని అన్నాడటీతడు.

రానున్నవి ఎలెక్షన్లుఅన్నాడటాతడు.
అంత దాకా ఆగుమరి నీ కలెక్షన్‌లకు అన్నాడటీతడు.

అతడు సోషలిస్టన్నాడటాతడు.
సోషలిస్టా ! అయితే వారిలో 'ఎన్నో లిస్టో' అన్నాడటీతడు.

చీఫ్ మినిస్టర్ గారు లేచారా ? అన అడిగాడట ఒక పిల్లమంత్రి  బంట్రోతుతో.
ఇంకా లేవలేదండీ? అన్నాడటా బంట్రోతు.
థాంక్సు ! అదే కావాలి, రక్షించావు
ఇక చేతనయినంత  భక్షించవచ్చునన్నాడటాతడు.

ఉన్నవానికి బరువన్నాడటాతడు.
ఎందుకన్నాడటీతడు.
తినజాలకన్నాడటాతడు.

లేనివానికి కరువన్నాడటాతడు.
ఎందుకన్నాడటీతడు.
లేక అన్నాడటాతడు.

బొత్తిగా బొగ్గయిపోతున్నావేమోయ్ ! అన్నాడటాతడు.
అదేమిసార్ ! అలా అని నన్నవమానిస్తారు,
అందరు అదే నాలాగయిపోతుందంటుంటే అన్నాడటీతడు.

ఏమిటి ఆగపడతలేవు అందట ఆవిడ
ఆగపడాలా ? ఆగపడకపోతేనే అగచాట్ల పాలవుతున్నాను
ఆగపడితే ఇంకేముంది సిగపాట్ల పాలు కానూ! అందట ఈవిడ.

'తెలుగు' కావాలోయ్, అని అడిగాడటాతడు.
తెలుగా ? అదయిపోయింది.
మన కాన్వెంటు విద్య పుణ్యమా అంట ఇపుడంతా అంతటా
'తెగులే' అన్నాడటీతడు.

ఏమిటి ? ఈ రోజు ఇంటికి పోలేదా ? అన్నాడటాతడు.
ఓహెూ ! ఇది అఫీసా? ఇల్లేననుకున్నానన్నాడటీతడు.

కాయా ? పండా? అన్నాడటాతడు.
అబ్బే ! అంతా కాయే, పండెపుడో పలాయనం చిత్తగించింది
కాయదే ఇప్పుడు ఖదరన్నాడటీతడు.

అదేమి ఇంగ్లీషు 'బట్లర్ ఇంగ్లీషు' అన్నాడటాతడు.
ఎన్నో ఎంగ్లీషుల్లో ఇదొక 'ఎంగిలీషు' (ఎంగిలి చేయబడింది) అన్నాడటీతడు.

ఎందుకలా దిగజారిపోతున్నావోయ్ అన్నాడటాతడు.
అనవసరంగా అండరేస్టిమేట్ చేయకండి సార్, దిగిసాగిపోతున్నానన్నాడటీతడు.

దేవుడున్నాడన్నాడటాతడు.
దేవుడుంటే మరి దేకుతావెందుకోయ్ ? అన్నాడటీతడు.

ఇదేమి కాలం, పాపపు కాలం, అంతటా అవినీతే నన్నాడటాతడు.
ఇపుడదే అసలు సిసలైన నీతి అన్నాడటీతడు.

అదేమిటలా నిద్రపోతున్నాడు ఆ పంతులన్నాడటాతడు.
నిద్రకాదోయ్ అది నిష్ఠ అన్నాడటీతడు.

మన దొరసాని రమ్మంటుందన్నాడట బంట్రోతు
వెధవ ! 'మన' ఏమిట్రా? నీ మధ్యది నామధ్యదారా అది? అన్నాడటీతడు (దొర)

మన అమ్మాయి 'సమర్తయింది' అన్నాడటాతడు.
సమర్థయిందా ? మంచి ఉద్యోగం చూచి చేర్పించండన్నాడటీతడు.

**పోస్ట్ సార్ ! అన్నాడట ఆతడు (పోస్ట్‌మ్యాన్)**
ఎక్కడనుండన్నాడటీతడు.
**ఇంగ్లండ్ సార్ ! అన్నాడటాతడు.**
ఓరి నీ తస్సాదియ్యా, ఇదటోయ్! ఇది 'ఇన్‌లాండు' అన్నాడటీతడు.

**'రాస్తారోకో' అంటే ఏమిటన్నాడటాతడు.**
అదేముంది, రాజకీయులు, వారి అనుయాయులు త్రోవకడ్డం తోడేల్లా పండడమన్నాడటీతడు.

**రాం ! రాం ! అన్నాడటాతడు.**
ఏం? ఒకటి చాలదా రెండెందుకన్నాడటీతడు.
**ఒకటి మరచిపోయినా ఇంకొకటి అందుబాటులో ఉండేందు కన్నాడటాతడు.**

**'రంగులరాట్నం' బాగుందోయి అన్నాడటాతడు.**
వడికి చూడు ఇంకా బాగుంటుందన్నాడటీతడు.

**ఈ కాలంలో అమ్మాయిలట్టే పెరిగిపోతున్నారోయ్ అన్నాడటాతడు.**
మనకు తరిగే కాలమొస్తే వారిలా పెరగకేం చేస్తారన్నాడటీతడు.

**నేనూ ఆయనా కలిసి 'అరకు' (అరకూవ్యాలీ) కెళ్ళామందటావిడ,**
పక్క కొట్లోనే దొరకగా వదికోసులెందుకందిటీవిడ.

**అనగననగరాగ మతిశయిల్లుచునుండు, తినతినగ వేము తియ్యగుండునని అన్నారే!**
**నేను సరే చూద్దామని వేపాకు తింటూనే ఉన్నాను తియ్యబడదేమిటి**
**అన్నాడటాతడు.**
వేపాకు కాదోయ్ తియ్యబడేది, నోరు, అన్నాడటీతడు.

**నేనర్జంటుగా పోవాలి మరి అన్నాడటాతడు Airport లోని Booking Clerk తో.**
తిరిగి రానంటే అలాగే, అన్నాడటీతడు.

**ఆమె కన్నుల్లో కమలాలున్నాయన్నాడటాతడు.**
అంతవరకెందుకూ, మన కొలనులో లేవూ కోకొల్లలు అన్నాడటీతడు.

**రానూ రానూ రమణులకు 'రహస్యమే', లేకుండా పోతోందోయ్ అన్నాడటాతడు**
సినీమా హాస్యానికి దాస్యమయి అన్నాడటీతడు.

**నాది 'రమణి' కాదోయ్ 'మణి' అన్నాడటాతడు.**
పోనీ కిందిది నీవుంచుకొని, మీదిది నాకిచ్చేయగూడదూ అన్నాడటీతడు.

**ఒకరాజుకు ఏడుగురు కొడుకులన్నాడటాతడు.**
అబ్బో ! మరి భార్యలెందరో అన్నాడటీతడు.
**భరించినందరు అన్నాడటాతడు.**

**అవకాయ కావాలా, అప్సరస కావాలా? అన్నాడటాతడు**
అవకాయ లాంటి అప్సరస అన్నాడటీతడు.

**'బడికి', 'రాబడికి' తేడా ఏమిటన్నాడటాతడు.**
ఒకపుడు ఉండేది కాని ఇపుడు బడే రాబడి, రాబడే బడి  అన్నాడటీతడు.

**మీరు చాలా బాగా పాడతారండీ అన్నాడటాతడు.**
మీకెలా తెలుసునన్నాడటీతడు.
**మీరు 'సరం' తప్పినపుడు విన్నానన్నాడటాతడు (స్వరం).**

**'రానా'? అందిట ఆవిడ లోనికి రావడానికి అనుమతి అడుగుతూ.**
రా, నా,  అన్నాడటీతడు.

**ఎందుకేడుస్తున్నావోయ్ అన్నాడటాతడు**
ఇపుడేడవమేమిటి కొత్తగా, నేను పుట్టుకతోనే అలా పుట్టానంది మా అమ్మ అన్నాడటీతడు.

**ఏం ! ఏబ్బెట్టుగుందా అందట ఆవిడ**
లేదు లేదు, ఎబ్ - అట్ (Eb-At) గ అన్నాడటీతడు.

**రాం, రహీమ్, ఒకరే అంటారు నిజమేనా ? అన్నాడటాతడు**
అవును, అపుడపుడూ అలా పేర్లు మార్చుకుంటారు అన్నాడటీతడు.

**దొంగంటారు దొరంటారు,**
**చూస్తుంటే నాకు దొంగెవరో దొరెవరో బొధపడడంలేదన్నాడటాతడు.**
రెండింటికి 'దొ' ఒకటే కనుక 'గో' ఒకటే సార్ అన్నాడటీతడు.

**బస్సు లేటా, రైలు లేటా, ప్లేను లేటా, అన్నాడటాతడు,**
ఒకటి తరువాత ఒకటి అన్నాడటీతడు.

**ఏ 'సర్కస్' కెళ్లావన్నాడటాతడు.**
'మహానాడు సర్కస్' కన్నాడటీతడు.

**టికెట్టు దొరుకుతుందా సినీమాకు అన్నాడటాతడు.**
'వికెట్' పట్టుకుంటే టికెట్‌దొరకకేంజేస్తుందన్నాడటీతడు.

**దమ్ముంటే 'రా' అన్నాడటాతడు.**
'రమ్మ'కొట్టి ఆ పిదప 'దమ్ము' కొట్టి వస్తానన్నాడటీతడు.

**'రమ్ముకు' 'దమ్ముకు' తేడా ఏమిటన్నాడటాతడు.**
రమ్ముంటె రిమ్మెక్కువయి దమ్మెక్కువ అన్నాడటీతడు.

**అదేంటి అలా నవ్వుతున్నారు అందిటావిడ**
'మీరదోలా కెవ్వుతుంటేనూ' అన్నాడటీతడు.

**హాస్యానికి అపహాస్యానికి తేడా ఏమిటన్నాడటాతడు.**
ఒకటి 'నవ్వించేది', ఒకటి 'కవ్వించేది' అన్నాడటీతడు.

**'పొయ్యోస్తా' నన్నాడట పోతూపోతూ ఒకరింట్లో పడుకున్న ఒక 'అతిథి' ఇంకా తెల్లవారకముందే గృహస్తునులేపి.**
ఇకమీదటొస్తే నేనే 'నుయ్యోస్తా' నన్నాడట నిద్రాభంగమైన గృహస్తు.

**ఏం ఇంత 'లేటు' అన్నాడటాతడు.**
ఏం చేయను సార్! 'నాన్-స్టాపు' లోనే ఎక్కాను,
కాని ప్రతిచౌరాస్తా వద్ద పోలీసు వలన పడిగాపు అన్నాడటీతడు.

**పరువు పోయిందన్నాడటాతడు.**
పోలీసుకు రిపోర్టు ఇవ్వరాదూ? అన్నాడటీతడు.
**ఉన్నది కాస్త ఊడుతుందన్నాడటాతడు.**

అక్కడున్న వారిని పరిచయం చేస్తూ, ఒకతడు,
ఇతడు క.వి.
ఇతడు కో.కి.ల.
ఇతడు వీ.ణ.
ఇతడు త.బ.ల.
ఇతడు హ.ర.మ.ని.
**ఇతడు వ.యో.లి.న్. అన్నాడట.**
వీరి బృందం పేరూ? అన్నాడట విన్నవాడు.
బృందమేంటి నా శ్రాద్ధం,
అవి వారి లాంగు పేర్లకు షార్టు పేర్లు! అన్నాడటాతడు.

**విప్లవం వర్ధిల్లాలి అన్నాడటాతడు,**
ప్రస్తుతం 'ద్రవం' వర్ధిల్లనీ, అటు తదుపరి 'ఉపద్రవం',
ఆ పిదప 'విప్లవం' అన్నాడటీతడు.

**రాజ్యం నయమా 'భాజ్యమా? అన్నాడటాతడు.**
వీలయితే 'రాజ్యం - భాజ్యం' నయం, వీలుకాకపోతే 'రాజ్యం'.
అదీ వీలుకాపోతే 'భాజ్యం' అన్నాడటీతడు.

**ఆ 'దొంగలున్నారు జాగ్రత్త' బోర్డు మరీ పాతదయిందోయ్ ! అన్నాడటాతడు.**
'దొర - దొంగలున్నారు' అని వ్రాద్దామా సార్! మరి, అన్నాడటీతడు.

**నవ్వు, ఎలా నవ్వుతావో చూస్తానన్నాడట ఒక రంగులరాయుడు**
**రాస్తాగుండాపోతోన్న ఓ రమణితో,**
అదేమిటో కాని ఒకరు కెవ్వనందే నాకు నవ్వు రాదు సార్ !
అని అందటావిడ కాలిచెప్పు రివ్వుమని విసురుతూ.

**మంత్రిగారున్నారా? అన్నాడటాతడు.**
మంత్రిగారు తంత్రిగారివద్దకెళ్లారండీ అన్నాడటీతడు.
**తంత్రిగారు కూడా లేరే నేనక్కడినుండే వస్తున్నానన్నాడటాతడు**
**మరయితే ఇద్దరూ' కలిసి 'కుతంత్రి' గారి వద్దికెళ్లుంటారన్నాడటీతడు.**

**పత్తాలాడుతున్నావా ! అన్నాడటాతడు.**
పత్తాలాడీ ఆడీ 'బిల్పత్తా' అయాను, ఇంకేం పత్తాలాడుతా నన్నాడటీతడు.

**రేసులకెళ్లడం లేదా ఈ మధ్య అని అన్నాడటాతడు,**
రేసులకెళ్లడం వలన అప్పులపాలయి ఇరుక్కున్న 'కేసుల' కెళ్తున్నానన్నాడటీతడు.

**అతడు 'సదా - సంతోషి' అన్నాడటాతడు.**
ఇతడు 'అదా - సంతోషి' అన్నాడటీతడు. (అదాఃముడుపు)

**'ఆలికి', 'వెలనాలికి', తేడా ఏమిటన్నాడటాతడు,**
'మాలికి', 'కూలి' కున్న తేడా అన్నాడటీతడు.

**'చందా' ఇస్తావా ! అన్నాడటాతడు,**
ఇచ్చి ఇచ్చి ఇప్పటికే 'లొందా' అయిపోయా, నా 'బొందా' ఇస్తా అన్నాడటీతడు.

**తంతె పరుపులో పడ్డావోయ్ ? అన్నాడటాతడు,**
నా ముఖం, పరుపా పాడా, 'సరువు' (దెబ్బ) you are welcome అన్నాడటీతడు.

**మృదంగం వాయించనా, వీనా, వయోలినా, తబలానా, హార్మోనియమా, అన్నాడటాతడు.**
ప్రస్తుతం తలనొప్పోంది తలవాయించుమన్నాడటీతడు.

**ఎక్కడినుంచోయ్? అని అడిగాడట ఒక Interview లో**
**ఒక Selection Board మెంబర్ ఒక ఉద్యోగానికొచ్చినవాన్ని.**
టి.క్యూ. నుండి (టి.క్యూ అంటే తాలూకాకు Short form లెండి) అన్నాడటాతడు.
అయితే P.Q. (పీకు, పోయిరా) అన్నాడట ఆ మెంబర్ అర్థంకాక.

**ముఖం కడుక్కోకూడదూ అన్నాడటాతడు.**
నువ్వుచెప్పాలటోయ్ అది తెల్లబడితే అన్నాడటీతడు.

**ఈరోజుల్లో స్నేహితులెవ్వరో, కాని వారెవ్వరో తెలియడం లేదన్నాడటాతడు.**
వ్యాఘ్రాలయితె తెలుస్తాయి కాని, గోముఖ వ్యాఘ్రాలైతే ఎలా తెలుస్తాయన్నాడటీతడు.

**కొద్దిగ ఓపిక పట్టవోయ్! అన్నాడటాతడు**
ఇప్పటికి పదేళ్లు, ఇంకెన్నేళ్లో? అన్నాడటీతడు.

**పచ్చడ? అన్నాడటాతడు ఆవిడతో,**
ఇదుగో వస్తున్నా, చేస్తా అందటావిడ.

**వాళ్ళెప్పుడూ 'లుంగీలే' వేసుకుంటారేమిటోయ్? అన్నాడటాతడు.**
లుంగీలేసుకుంటే 'వంగీలు' సులభమని అన్నాడటీతడు.

**అతడు కోర్టుకెళ్తానంటున్నాడు మీరేమంటారు? అన్నాడట**
**ఒక లాయర్ ఒక క్లయింటుతో**
కోర్టుకెళ్లినప్పుడు కోర్టు (Court) చేద్దాం
అంతవరకు 'Let us be sport' అన్నాడాట క్లయింటు.

**అదేమిటి అది అలా అంతగా చిందులుతొక్కుతోంది అన్నాడటాతడు**
మందు కొట్టాక చిందులు తొక్కక సందులు తొక్కక మరేంచేస్తుందన్నాడటీతడు.

**రేపటి వరకు 'వేట్' చేద్దామా అన్నాడటాతడు,**
అతని 'హీట్' తగ్గితే లేటయినా ఫరవాలేదన్నాడటీతడు.

**నువ్వు Defence లో పడ్డావోయ్ అన్నాడటాతడు.**
అవును, fence లో పడడంకన్నా Defence లో పడడం మేలని అన్నాడటీతడు.

**శైవం పెద్దా, వైష్ణవమా? అన్నాడటాతడు.**
వాతమయితే వైష్ణవం, లేకపోతే 'శైవం' అన్నాడటీతడు.

**కోరి వరించావటోయ్ ఆమెను? అన్నాడట మెజిస్ట్రేట్ ఒక కొట్లాడిన భర్తతో**
కాదుసార్ ! వరించి కోరాను అన్నాడటీతడు.

**భలే 'రసోయి' (వంటవాడు) వోయ్ అన్నాడటాతడు.**
అంతా మీ దయ. మీరు నేర్పిందే కదా తినీ తినీ, అనీ అనీ
నేను మెనీ మెనీ, వినీవినీ చేసి ఇలా గయ్యాను సార్, అన్నాడట ఆ వంటవాడు.

**మీ 'ముద్దాయి'కన్నా మీ 'గవా' చురుకోయ్ అన్నాడట ఒక మెజిస్ట్రేట్ ఒక వకీల్‌తో.**
అతడెప్పుడూ అంతే సార్! అన్నాడటా వకీల్.

**'రంగ' 'రంగా' అని కాజేశాడన్నాడటాతడు.**
చెబితే విన్నారా సార్ ! మీరు 'శివ' 'శివా'! యని అనుమంటే అనక
మూడు తాడిచెట్ల నీళ్ళలో మునిగితిరి అన్నాడటీతడు.

**నేననుకోలేదు పల్లెల్లో కూడా పల్లేరుకాయలుంటాయని అన్నాడటాతడు.**
నేనూ అనుకోలేదు పట్టణాల్లోకూడా పుష్పాలుంటాయని అన్నాడటీతడు.

**మా నాన్నకు విద్య గురించి అభిప్రాయాలే అభిప్రాయాలు అన్నాడటాతడు.**
అభిప్రాయాలాపాడా, అభిమానాలు? అన్నాడటీతడు.

**ఏం సార్! ఈ రోజు "బజానా" లేదా అన్నాడటాతడు.**
"ఖజానా'' ఉంటేనే కదా "బజానా'', లేకపోతే "సోజానా''నే అన్నాడటీతడు.

**ఆయన ఇంట్లో లేడు రేపు రావయ్యా అందటావిడ.**
అందుకేగా అదును చూచుకొని ఆయన కొరకుకాదు మీ కొరకొచ్చానన్నాడతడు.

**నాకు ఫ్రెంచ్ భాష చాలా ఇష్టమన్నాడటాతడు.**
**ఎందుకు అన్నాడటీతడు.**
వింటుంటే తింటున్నట్లుంటుందది, అన్నాడటాతడు.

**నాకు జర్మన్ భాష చాలా అయిష్టమన్నాడటాతడు.**
**ఎందుకు అన్నాడటీతడు.**
వింటుంటే కంటున్నట్లుంటుందది, అన్నాడటాతడు.

**ఐఎఎస్ అంటే ఏమిటన్నాడటాతడు**
అప్పుడేమిటోకాని ఇపుడు మాత్రం "ఇండియన్ అటెస్టేషన్ సర్వీస్" అన్నాడటీతడు.

**ఐపిఎస్ అంటే ఏమిటన్నాడటాతడు.**
అప్పుడేమిటోకాని ఇప్పుడు మాత్రం "ఇండియన్ పోస్టుమార్టమ్ సర్వీస్" అన్నాడటీతడు.

**ఐఎఫ్ఎస్ అంటే ఏమిటన్నాడట ఆతడు.**
అప్పుడేమిటో కాని ఇప్పుడు మాత్రం "ఇండియన్ ఫారిన్ ట్రేడ్ సర్వీస్" అన్నాడటీతడు.

**ఎఫ్ఐపి అంటే ఏమిటి అన్నాడటాతడు.**
యు.జి.సి. అన్నది 'ఫ్యాకల్టీ ఇంప్రూవ్‌మెంట్ ప్రోగ్రాం' అది కాని
వాస్తవానికి అనాల్సింది 'ఫ్యామిలీ ఇంప్రూవ్‌మెంట్ ప్రోగ్రామ్' అని అన్నాడటీతడు.

**మెరిట్ ప్రమోషన్ అంటే ఏమిటన్నాడటాతడు.**
యు.జి.సి.కి "మెరిట్ ప్రమోషన్", వచ్చినవారికి మాత్రం "మెర్సీ ప్రమోషన్" అన్నాడటీతడు.

**యూనివర్సిటీ అంటే ఏమిటి అన్నాడటాతడు.**
ఒకప్పుడు 'నాలెడ్జ్'కు మేటి కాని, ఇపుడు మాత్రం 'పిటీ' అన్నాడటీతడు.

**వైస్ ఛాన్సలరంటే ఎవరన్నాడటాతడు.**
అపుడు వైజ్ (wise) కాని, ఇపుడు మాత్రం వైస్ (vice), మైస్ (mice) అన్నాడటీతడు.

**ప్రొఫెసరంటే ఎవరన్నాడటాతడు.**
తక్కువ చెప్పి ఎక్కువ లాగేవాడన్నాడటీతడు.

**లెక్చరర్ అంటే ఎవరన్నాడటాతడు.**
తక్కువ చెప్పి ఎక్కువ వాగేవాడన్నాడటీతడు.

**అరే నేను వస్తావనుకొని రాలేకపోయానోయ్ ఆనాడు అన్నాడటాతడు.**
పోనీలెండి సార్ ! నేను కూడా తెస్తానన్నది ఆరోజు తేలేకపోయానన్నాడటీతడు.

**మానాపమానాలు దైవాధీనాలంటారు నిజమేనా ? అన్నాడటాతడు.**
అది 'నానుడి' సార్ ! అసల్ది మన సుడి! అన్నాడటీతడు.

**'నేనూ' 'నీవూ' ఒకటే అంటారు 'అధ్యాత్మికంగా', నిజమేనా ? అన్నాడటాతడు.**
శారీరకంగా అయితే నాకు తెలుసు, అధ్యాత్మికంగయితే మా అవ్వనడగాలి అన్నాడటీతడు.

**ఎవరు నిజం, నేనా, నీవా? అన్నాడటాతడు,**
'నిజం' అన్నాడటీతడు.

**నిజమంటే ఏమిటి అన్నాడటాతడు.**
ఇజాన్ని మించేది, వంచేది అన్నాడటీతడు.

**'ఎండమావంటే' ఏమిటన్నాడటాతడు**
అట్టడుగు వారినడగండి, వారే చెబుతారన్నాడటీతడు.

**'ధైర్యంలో' 'స్థైర్యంలో' తేడా ఏమిటన్నాడటాతడు.**
స్థైర్యం దాటితే ధైర్యం అన్నాడటీతడు.

**'రా, కూర్చో', అన్నాడటాతడు.**
కూర్కడానికే లేదు తీరిక, కూర్చోడానికెక్కడుంది అన్నాడటీతడు.

**రాసీ, రాసీ, రాసికెక్కావోయ్ అన్నాడటాతడు.**
రాసికి కాదు 'రద్ది'కి అన్నాడటీతడు.
'రద్దీ' పెరిగితే, మునిసిపాలిటీ వాళ్ళకు తెలియజేయరాదూ అన్నాడటీతడు.

**దంతాలూడగొట్టుకోకు పంతాలకు పోయి అన్నాడటాతడు.**
అవి పోయాకనే కదా పోతున్నానన్నాడటీతడు.

**ఆడవారిని వయసడగగూడదంటారెందుకు అన్నాడటాతడు.**
అడిగితే ఐసయిపోతారని అన్నాడటీతడు.

**మగవారిని జీతమడగగూడదంటారు ఎందుకన్నాడటాతడు.**
జీతమడిగితే మూతి తిప్పుతారని అన్నాడటీతడు.

**Fan కి 'fan' కి తేడా ఏమిటన్నాడటాతడు.**
మొదటిది తనచుట్టూ తానే తిరిగేది
రెండవది ఇతరుల చుట్టూ అన్నాడటీతడు.

**పూవుల్లో పూవు ఏ పూవంటే మీకిష్టమని అడిగిందటావిడ,**
పూవుల్లో పూవయిన నీలాంటి పూబోణంటే అన్నాడటీతడు.

**అతడు కాస్త 'మంకు' అన్నాడటాతడు.**
కాస్తేమి కాస్త, 'రంకు' 'కంకు' 'పెంకు' 'బొంకు' అన్నాడటీతడు.

**అలా ఎగాదిగా చూస్తున్నావేంటి అన్నదట ఆవిడ**
మొదటి నుండి కొస వరకు బంతి లాగుంటేను అన్నాడటీతడు. (అతి లావు లెండి)

**అతడు భలే ఫిరాయింపురావన్నాడటాతడు**
అతనికి పేరే అలా పెట్టారు సార్! అన్నాటీతడు.

**అతడు భలే ఇండెపెండెంటోయ్ అన్నాడటాతడు,**
ఇపుడెవడు ఇండెపెండెంట్
ఇపుడంతా డిపెండెంట్. ప్రిటెండెంట్ అన్నాడటీతడు.

**'రాం', 'రహీం'లో తేడా ఏమిటన్నాడటాతడు**
రెండూ ఒకటే కాని, అనేవారు అనరాక ఒకటికి బదులు ఇంకొకటంటారన్నాడటీతడు.

**ఎందుకోయ్ ! అతడలా ఏడుస్తాడన్నాడటాతడు.**
**అదా ! అది ఏడ్వడం కాదు సార్!**
కన్నీళ్ళు రాందే కర్ణాటక సంగీతం రాదుగదా? అందుకని అన్నాడటీతడు.

**'కళ' గొప్పా, 'కల'నా అన్నాడటాతడు,**
ఇపుడు అదీ కాదు, ఇదీ కాదు, 'వల' అన్నాడటీతడు.

**లెక్కలు వ్రాశావా ? అన్నాడటాతడు,**
మన లెక్కలన్నీ గుక్కలోనే కదా, దానికెందకు సార్ 'పక్కా'
అందుకే దానిని 'పక్కకు చెక్కా', 'కుక్కా' అన్నాడటీతడు.

**'భలేనోయ్' చుక్కలేకుండా గుక్క తిరగకుండా మాట్లాడ్తావు! అన్నాడటాతడు.**
చుక్క ఉండి కూడా నీవు గుక్కలేక చెక్కలాగా ముక్కకూడా చక్కా కక్కలేవు,
నీకంటే నేనే 'ఎక్కా' అన్నాడటీతడు.

**ఏమయ్యా 'బాజా' బాగా బజాయిస్తున్నావన్నాడటాతడు,**
ఒక్కబాజా యేంటి, 'బాజా', 'ఫీజా', 'చూజా' 'ప్యాజా', 'బూజా' (త్రాగుడ) ఎప్పటికప్పుడు
ఏదో విధంగా 'తాజా' నాపేరే 'ఖాజా' జా,జా, అన్నాడటీతడు.

**ఎందుకయ్యా, ఇంతకు అంత రభస చేస్తావు అన్నాడటాతడు,**
ఇంతకు అంత చేయకపోతే,
అప్పిచ్చినవాడు ఇంతకుబదులు ఇంకెంతో చేస్తాడు సార్! అన్నాడటీతడు.

**అచ్చంగా అతనిలాగే ఉన్నావోయ్, అన్నాడటాతడు.**
అలా అవమానిస్తారేమి సార్!
అతడే నాలాగున్నానని ఆతడే అందరితో అంటుంటే అన్నాడటీతడు.

**కాపీ కొడితే కొట్టావు కాని, పక్కకు వీ.పీ. ఎందుకు చేశావోయ్ అన్నాడటాతడు,**
**(వీ.పి. అంటే వయా పాస్, ఒకరి నుండి ఇంకొకడికి కాపీ - చిత్తు అందివ్వడం)**
వీ.పి. చెయ్యకపోతే ఆ పాపీ పరీక్షయిపోయాక నా పీక పడతాడుసార్ అన్నాడటీతడు.

**ఎన్నిసార్లు చెప్పానోయ్ నీకు, నన్ను చూచి నవ్వొద్దని, అన్నాడటాతడు బంట్రోతుతో.**
నాకు నవ్వాగదు సార్! మాఅమ్మంది ఎందరో మీబోటివారిని చూచి ఆమెనవ్వుతుండగా నేను పుట్టానని అన్నాడటీతడు.

**ఏమి పనిచేస్తావోయ్ ? అని అడిగాడట పని కొరకు వచ్చినవానిని ఒకతడు.**
అమ్మగారిది చేయమంటే అమ్మగారిది, అయ్యగారిది చేయమంటే అయ్యగారిది అన్నాడట వచ్చినవాడు.

**ఎక్కడికిపోయినా అదే పాటా ? అన్నాడట ఆతడు,**
నా అప్పు పాటపెట్టండని నేనెంత కోరినా వినకపోతే నేనేం చేయను అదే బాట తొక్కక, అందుకే బేటా! అన్నాడట అప్పు తీసుకున్నవాడు.

**ఎలా జరిగిందోయ్ 'ప్రోగ్రామ్' అన్నాడటాతడు.**
ప్రోగ్రామా పాడా, ఒకరిపై ఒకరు పచ్చి 'సంగ్రామ్' అన్నాడటీతడు.

**అరెరే ! అంత న్యాయస్తునికి ఎంత అన్యాయం జరిగిందోయ్ అన్నాడటాతడు.**
అన్యాయం జరిగేదెప్పటికీ న్యాయస్తునికే, అన్యాయస్తునికి న్యాయమెందుకు,
అతడికతడే 'న్యాయం' అన్నాడటీతడు.

**రాత్రయిందన్నాడట ఆతడు,**
కాదు పగలన్నాడట ఈతడు.

**కాదు రాత్రి పగలన్నాడటాతడు.**
కాదు పగలురాత్రి అన్నాడటీతడు. (తప్ప త్రాగారు లెండి)
**"తిరిగితే అలాగే కనిపిస్తుంది, కరిగితే అదే మరోలా అనిపిస్తుంది" అన్నాడట అటుగుండా పోయేవాడొకడు.**

**విన్నావు కాదు Love కాదది వట్టి ఊకదంపుడు Vow అంటే అన్నాడటాతడు.**
లవే కాని ఏదో Slow లాంటిదనుకున్నాను, ఇలాంటి Shoe లాంటిదనుకోలే దన్నాడటీతడు.

**దేవుడున్నాడూ, ఉన్నాడూ అంటే 'లేడూ, లేడూ' అనంటివి, ఇపుడు వాడు నిన్ను నీవెవడివిరా? అని కొడుతుంటే, ఎలుగెత్తి ఏడుస్తావెందుకు దేవుడా! దేవుడా! యని అన్నాడటాతడు.**
శరణు ! శరణు ! నేనది నాదాకా వస్తుందని అనుకోలేదు ప్రభూ!
రక్షించు ! రక్షించు ! అన్నాడటీతడు.

**నాకు నిద్రపట్టడం లేదన్నాడటాతడు.**
దొంగలొచ్చేవేళయింది ఇక తప్పక పడుతుందన్నాడటీతడు.

**ఎంత వద్దన్నా ఊర్కోవడం లేదాన్నడటాతడు.**
ఊర్కోకపోతే కూర్కోబెడితే సరి? అన్నాడటీతడు.

**'సమ్మేదీ' ('సమ్మె' అంటే నేల చదును చేసే పనిముట్టులెండి) అన్నాడట ఒక లెక్కలసారు ఇంట్లో పనిచేస్తున్న సుతారివాడు.**
'సమ్మా'! ఇదిగోనని జేబులోకెల్లి తీసి చూపించాడట ఓ లెక్కను ఆ లెక్కల పండితుడు అది అదేననుకొని.

**నీది 'రణరంగమా, ఋణరంగమా' అన్నాడటాతడు.**
రెండవదడిగితే మొదటిది అన్నాడటీతడు.

**అతిశయోక్తి అంటే ఏమిటన్నాడటాతడు.**
అదొక భ్రమరంలా బ్రతికే యుక్తి, కుయుక్తి అన్నాడటీతడు.

**ఆహా! నాకు పొయెట్రీ సొసైటీ అంటే చాలా ఇష్టమన్నాడటాతడు.**
**ఎందుకన్నాడటీతడు.**
అక్కడ, భర్తలను పోగొట్టుకున్న భార్యలకు, భార్యలను పోగొట్టుకున్న భర్తలకు భలే గిరాకీ అన్నాడటీతడు.

**"రాం లీలా"కు పోదామా? అన్నాడటాతడు.**
నేనయితే ఈ రోజు "లీల"కు, రేపు "రాం"కు అన్నాడటీతడు.

**"ఆజ్ నగద్ కల్ ఉధార్" అన్నాడట ఒక దుకాన్దారు ఒక కొనుగోలుదారుతో.**
ఉధారే లేకపోతే నీలాంటి దుకాణాలు బైట హాజరన్నాడటాతడు.

**ఆమె ఒక "వల" అన్నాడటాతడు.**
ఎంత బాగుండును దానిలో నేను చేపలానైనా చిక్కగలిగితే అన్నాడటీతడు.

**అస్పృశ్యులంటే ఎవరన్నాడటాతడు.**
ఇతరులు అలా అంటే తిట్టేవారు, వారిలో వారే ఒకరినొకరు అనుకొని కొట్టుకునేవారు అన్నాడటీతడు.

**మా అమ్మకు "లాంగ్ సైట్" అన్నాడటాతడు.**
ఓహూ! అందుకేనా ఆమెకు విద్య గురించి అంత "షార్ట్ సైట్" అన్నాడటీతడు.

**అతడెప్పుడూ కృతజ్ఞతను కృతఘ్నత అంటాడేమిటి? అన్నాడటాతడు.**
ట్యూషన్ మాస్టర్కు ట్యూషన్ ఫీజు ఎగ్గొడితే అతడు దానిని అలా ఉచ్ఛరించుమని చెప్పుంటాడు అన్నాడటీతడు.

**విచారంగా ఉన్నావేమిటోయ్ అన్నాడటాతడు.**
'సార్' విచారించుమన్నాడు. విచారించినాకొలదీ, విచారించినాకొలదీ అదేమిటో కాని నాకు తెలియకుండా నా హుషారంతా పోయి నేనిలా 'బేచార్లా' అయిపోతున్నాను అన్నాడటీతడు.

**నీ పేరేమిటి అని అడిగాడటాతడు.**
షార్ట్దా, లాంగ్దా? ఇంటిదా, బైటిదా? అన్నాడటీతడు.

**ఈ మధ్య మీటింగ్లకు పోవడం లేదా? అని అడిగాడటాతడు.**
అబ్బబ్బ! మీటింగా పాడా! అచటికి పోవడమంటే అడుగడుగునా దారంటా ట్రాఫిక్ జామ్లలో వేటింగ్, గుంతల్లో అచటచటా ఇరికింగ్, ఆ పిదప ఆ పక్క ఈ పక్క నిలిచిన కాల్వనీళ్ళన్ని మనపైన చిలికింగ్, తీరా ఏలాగో ఓలాగు అచటికి కమింగ్ అయాక, అబ్బబ్బ! ఎంతో మంది వేదికపై మాట్లాడుటకు సిట్టింగ్! వినుటకు ఎంతోకాలం వేటింగ్, ఇంటికి తిరిగొచ్చాక మా ఆవిడ ఒకే ఒక పీకింగ్, ఆ పిదప నాకు ఒకే ఒక హెడేకింగ్ అన్నాడటీతడు.

**మీ పుస్తకాలేమైనా కొట్లల్లో అమ్ముడు పోతున్నాయా అని అడిగాడటాతడు.**
అమ్ముడా పాడా కాని వాటిని తీసీ తీసీ దాచీ దాచీ, వాటి అమ్మకాలకు వేచీవేచీ నేనమ్ముడు పోతున్నానన్నాడటీతడు.

**అతనిది 'ఆలిండియా పార్టీ' అంటాడేమిటి అన్నాడటాతడు.**
ఆలిండియానా పాడా! అదొక "లెటర్ ప్యాడ్" పార్టీ, దానిలో A to Z వాడే అన్నాడటీతడు.

**నీవు 'రిజైన్' చేశావటగా ఆ పార్టీకి అన్నాడటాతడు.**
అపుడేనా, వేరే చోట ఇంకా చోటు కల్పించుకోందే? అన్నాడటీతడు.

**థర్డ్ పార్టీ అంటే ఏమిటన్నాడటాతడు.**
రెండు పార్టీల్లో వెలగక, వెలగబెట్టలేక, అటూ ఇటూ కాక, ఆ వైపుకూ ఈ వైపుకూ దిక్కులు చూచే 'అలీన' అర్ధనారీశ్వర పార్టీ అన్నాడటీతడు.

**"బికినీ" అంటే ఏమిటి అన్నాడటాతడు.**
తగ్గించంగా తగ్గించంగా ఇక తగ్గలేనని మొరపెట్టుకొని అదే అంతటితో ఆగిపోయే బిక్కుబిక్కుమనే ఆడవారి 'టక్కీ' అన్నాడటీతడు.

**నేననుకోలేదు పల్లెటూళ్ళల్లో కూడా ప్రతిభావంతులుంటారని అందట ఆవిడ.**
నేననుకోలేదు పట్టణాల్లో కూడా పతివ్రతలుంటారని అన్నాడటీతడు.

**మీరింకా రాజకీయాలలో ఎందుకు చేరలేదని అడిగాడట ఒకడు ఒకతనిని.**
చేరినవారు కేరడమంతా మానాక చేరుదామని అన్నాడటీతడు.

**అతడు తెలుగువాన్నంటూ తెలుగు భాష అలా మాట్లాడతాడేంటి అన్నాడటాతడు.**
అది తెలుగు కాదోయ్ 'మీడియా' వారు హడావిడిగా ఉపయోగించే "తెగులు" అన్నాడటీతడు.

**అదేమిటి అతడు తెలుగులో అన్ని ఇంగ్లీషు పదాలు కలిపి మాట్లాడతాడేంటి అన్నాడటాతడు.**
(ఆంధ్రుడులెండి)
హిందీ పదాలు, ఉర్దూ పదాలు కలిపి మాట్లాడితే అల్పుడనుకుంటారు, ఇంగ్లీషు కల్పి మాట్లాడితే గొప్పనుకుంటారని అతడి భావం అన్నాడటీతడు. (ఆంధ్రుడు లెండి)

**ఒక పుజారి ఒక ధనవంతుని ఇంటిలో సత్యనారాయణ వ్రతమయిపోయాక పోతూ పోతూ గృహస్తుతో "మీరు చదవకుండానే ఇంత వారయ్యారు, చదివితే ఇంకెంత వారయేవారో" అన్నాడట.**
'మీ అంత' అన్నాడటాతడు.

**లంచం కావాలా, మంచమా? అన్నాడటాతడు.**
ఒకటి తర్వాత ఇంకొకటి అన్నాడటీతడు.

**పిల్ల కావాలా, ముల్లె కావాలా ? అన్నాడటాతడు**
ముల్లెతోపాటు పిల్ల అన్నాడటీతడు.

**నాన్న మంచా, అమ్మ మంచా? అన్నాడటాతడు**
నాన్న లేనపుడు అమ్మ, అమ్మ లేనపుడు నాన్న అన్నాడటీతడు.

**అందం కావాలా గంధమా ? అన్నాడటాతడు.**
గంధంలాంటి అందం అన్నాడటీతడు.

**దేవుడున్నాడు అన్నాడటాతడు**
ఉంటే రాడేమి? పడుకున్నాడా ? అన్నాడటీతడు.

**లంచమెలా పోతుందన్నాడటాతడు.**
కంచం పెరిగితే తప్ప పోదన్నాడటీతడు.

**ఆమె భర్త పోయాక ఇపుడెలా ఉంది అని అడిగాడటాతడు**
పాపం అతి రంధి వలన ఆమె తెల్ల వెంట్రుకలన్నీ నల్లబడిపోయాయన్నాడటీతడు.

**ఎంత మాట తీపి అయితే అంత బాట తీపి అన్నాడటాతడు**
ఒకప్పుడు కావచ్చు కాని ఇపుడు మాత్రం ఎంత మూట తీపయితే అంత అన్నాడటీతడు.

**మీరు ఆ తారు రోడ్డులో ఉంటున్నారా ? అన్నాడటాతడు**
ఒకప్పుడు ఉండేవాన్ని కాని, ఇపుడు 'బార్ రోడ్డు'లో అన్నాడటీతడు.

**నీతి నెగ్గుతుందా ప్రీతా? అని అడిగాడటాతడు.**
ఇపుడు అదీ కాదు ఇదీ కాదు 'ఛాతి' అన్నాడటీతడు.

**రాజకీయం కావాలా, వ్యాపారమా ? అన్నాడటాతడు**
"రాజకీయ వ్యాపారం" అన్నాడటీతడు.

**అపుడపుడు వస్తుండండి అందిట ఒకాయనతో ఒకావిడ**
తమరు రమ్మనాలి కాని అపుడపుడేంటి, ఎప్పుడూ! అన్నాడటీతడు.

**"ధర్మం" చేయండి అన్నాడట ఒకడు గేటు ముందు నిలచి**
ధర్మమా! ధర్మం చేసీ చేసీ చర్మమూడింది, ఇంకెక్కడి ధర్మం పో అన్నాడటీతడు.

**ఉపన్యసిస్తున్నాడా అని అడిగాడట ఆతడు**
లేదు, ఇంకా ఉప - విన్యాసమే అన్నాడటీతడు.

**అదేమిటి, అతడు నవ్వనే నవ్వడు అన్నాడటాతడు**
అతడు పుట్టినపుడు ఎవ్వరో తుమ్మారట అన్నాడటీతడు.

**చెప్పినవన్నీ చేస్తారా ఆ పార్టీవారు? అన్నాడటొతడు**
పెట్టుబడి పెట్టినవన్నీ మట్టుబడి అయ్యాక అన్నాడటీతడు.

**మీకు రామాయణమిష్టమా, భారతమా? అన్నాడటొతడు**
'భారత'మయ్యాక ఇంకా జీవిస్తే రామాయణం అన్నాడటీతడు.

**"ఆస్తికి", "అస్తికి" తేడా ఏమిటి అన్నాడటొతడు**
అప్పుడేమో కాని ఇప్పుడు మాత్రం ఆస్తి బినా అస్తి నాస్తి అన్నాడటీతడు.

**చదువుకుంటున్నారా? అని అడిగాడటొతడు**
నాకేం ఖర్మ పట్టింది, కొంటున్నానన్నాడటీతడు.

**పట్టభద్రుడా? అని అడిగాడట ఒకతని గురించి ఒకతడు**
పట్టభద్రుడా పాడా! వట్టి భద్రుడు. కనీసం పేరైనా ఎలా పెట్టుకోవాలో తెలియదు అన్నాడటీతడు.

**అతడు చాలా సుఖవంతుడు అన్నాడటొతడు**
లౌక్యులందరూ సౌఖ్యులే అన్నాడటీతడు.

**కన్య అంటే ఎవరన్నాడటొతడు**
ఆ మాత్రం తెలియదా? కనంది కన్య, కన్నది అన్య అన్నాడటీతడు.

**ఆమె ఇంత త్వరగా అంతెత్తు ఎలా ఎదిగింది అన్నాడటొతడు**
భర్తను పోగొట్టుకొని దానిలో భర్తీ అయిందన్నాడటీతడు.

**ఈరోజు అన్నమా? పరమాన్నమా ? అని అడిగాడటొతడు**
పరమాన్నమా పాడా! పచ్చి ఇంగువెక్కువేసి వండిన అరవాన్నం అన్నాడటీతడు.

**తెలంగాణా తెలుగువారు వేరు, ఆంధ్రా తెలుగువారు వేరా అన్నాడటొతడు**
భావాలు ఒక్కటే కాని స్వభావాలు వేర్వేరు అన్నాడటీతడు.

**రాం గొప్పా, రహీం గొప్పా అన్నాడటొతడు**
ఎవరి వలన కలిసొస్తేవారు అన్నాడటీతడు.

**నాకు కవి సమ్మేళనాలంటే చాలా అయిష్టమన్నాడటొతడు**
**ఎందుకన్నాడటీతడు.**
కవులెక్కువ, వారిని కనేవాళ్ళు, వినేవాళ్ళు తక్కువ అన్నాడటీతడు.

**ఏది తప్పో, దాని కొరకు చూస్తున్నారా ? అని అడిగాడట ఒక proof-reading చేసే వాన్ని ఒకతడు.**
కాదు, ఏది ఒప్పో, దాని కొరకు అన్నాడటాతడు.

**ఏమి చేస్తున్నారిపుడు అని అడిగాడటాతడు**
చేసిన అప్పులు తీరుస్తున్నాను, రాసిన తప్పులు దిద్దుతున్నాను అన్నాడటీతడు.

**"కాంతం" (ఒకామె పేరు) కావాలా, ఏకాంతమా ? అని అడిగాడటాతడు**
కాంతంతోపాటు ఏకాంతం అన్నాడటీతడు.

**ఆహా! బంగారంలాగుంది! అన్నాడటాతడు**
నీ బొంద, బంగారమా పాడా! బొట్టిక్కులో అరువడుక్కొచ్చుకున్న సింగారమది అన్నాడటీతడు.

**ఇపుడేమి చేస్తారు" అని ఒకతడు ఒక రిటైర్ అయినవాన్ని అడిగాడటాతడు**
ఇపుడు చూస్తాను, కాసేపాగి చేస్తాను, ఇంకాసేపాగి మేస్తాను, మరింకాసేపాగి లేస్తాను, చుట్టపీలుస్తాను, మరికాస్తాగి గీస్తాను, కూస్తాను, కంచం తీస్తాను, మంచం వేస్తాను నీకెందుకోయ్ అన్నాడటీతడు. (ముక్కోపి లెండి)

**నాకు జన సమూహం అంటే గిట్టదన్నాడటాతడు**
అలాగా? అందుకేనేమో తమరు పల్లెటూరి నుండి పట్నమొచ్చారు అన్నాడటీతడు.

**మన్నెపు వారంటే ఎవరని అడిగాడటాతడు**
వారిని అంటరాని వారంటే ఊర్కోనివారు, కాని మాదిగలను మాత్రం అంటరాని వారనే వారు అన్నాడటీతడు.

**జ్ఞానికి, పట్టభద్రునికి తేడా ఏమిటి అన్నాడటాతడు**
ఒకడు తెలిసినవాడు, ఒకడు బలిసినవాడు అన్నాడటీతడు.

**మతానికి, ఆచారానికి తేడా ఏమిటి అన్నాడటాతడు**
ఏది చెప్పేదో అది మతం, ఏది తప్పేదో అది 'ఆచారం' అన్నాడటీతడు.

**ఒక పరిశోధకుడు ఒక ఊద్భే దానితో "నీ పని చూస్తే నాకు చాలా జాలేస్తోంది" అన్నాడట.**
"నా సాధనపైననే కదా మీ శోధన, ఎవరు ఎవరిపై జాలిపడాలో మరి!" అందిట ఆవిడ.

**మీ పుస్తకాలు ఏమైనా అమ్ముడు పోతున్నాయా కొట్లల్లో అని అడిగాడటాతడు**
అమ్ముడా పాడా!అడిగినవాడల్లా తుమ్ముడే తుమ్ముడు అన్నాడటీతడు.

**రాం గొప్పా, రహీం గొప్పా అని అడిగాడటాతడు**
రాం వారికి రాం, రహీం వారికి రహీం, రాజకీయులకు మాత్రం వారిరువురూ same, అన్నాడటీతడు.

**లంచం తీసుకునేవాన్ని లంచగొండి అంటారేమిటి "లంచకొండి" అనకుండా అని అడిగాడటాతడు**
అది "భద్రిరాజుగారిని అడిగే ప్రశ్న" నన్ను కాదు, అన్నాడటీతడు.

**లీడర్ కావాలా ఫ్లీడరా అని అడిగాడటాతడు**
ఫ్లీడరే లేకపోతే లీడర్ 'హవా' అందుకని ఫ్లీడరే అన్నాడటీతడు.

**"ప్రసిద్ధి" అంటే ఏమిటి అని అడిగాడటాతడు**
'సిద్ధి', తదుపరిది అన్నాడటీతడు.

**మీరెందుకు పెళ్లి చేసికోరు అన్నాడటాతడు**
నాకు కావలసింది పెళ్ళాం కాదు పెళ్ళాం లాంటిది అన్నాడటీతడు.

**ఈ సంసారమంతా ఒక గోళం అన్నాడటాతడు.**
అయితే కావచ్చుకాని, మాది మాత్రం అంతా గందరగోళం అన్నాడటీతడు.

**"తెలుగు" వేరు, "ఆంధ్రం" వేరా అన్నాడటాతడు**
అప్పుడేమో కాని, ఇపుడు మాత్రం అయ్యేట్లున్నాయి వేర్వేరు అన్నాడటీతడు.

**లవ్‌కు రొమాన్స్‌కు తేడా ఏమిటన్నాడటాతడు**
పెళ్ళాడక పూర్వపుది రొమాన్స్, పెళ్ళాడిన పిదపది లవ్ అన్నాడటీతడు.

**"రాం రాం జప్నా" అన్నాడటాతడు**
"పరాయి మాల్ అప్నా" అన్నాడటీతడు.

**మా ఆవిడ ప్రతిదానిపై 'కసురు', 'విసురు' అన్నాడటాతడు**
మీ ఆవిడే ఇంకా నయం, మా ఆవిడ మరీ ముసురు, పిసురు, కొసురు అన్నాడటీతడు.

**నాది చాలా "కన్నింగ్" అన్నాడటాతడు.**
నీదే ఇంకా నయం, నాది కన్నింగ్‌తో పాటు రన్నింగ్, తన్నింగ్, స్పిన్నింగు కూడా అన్నాడటీతడు.

**మాదెన్నటికీ తయారు కాదు అన్నాడటాతడు**
మీదే నయం, మాదన్నిటికీ అంతటికీ 'భోజనం తయారు' లా రెడీమేడ్ అన్నాడటీతడు.

**మాది తోడంటే తొడకోసుకుంటుందన్నాడటాతడు**
మీదే నయం, మాది ప్రతీదానికీ 'నో ఓటు,' 'గగుర్పాటు' అన్నాడటీతడు.

**నాది చాలా "మోటు" సార్ ! అన్నాడటాతడు.**
నీదే నయం, నాది "బ్రూటు" కూడా అన్నాడటీతడు.

**మా ఇంటి చుట్టూ మృగాలే అన్నాడటాతడు.**
మీఇల్లే నయం, మా ఇంటి నిండా అవే అన్నాడటీతడు.

**మాది వట్టి 'గొప్పల్డి' అన్నాడటాతడు**
మీదే నయం, మాది 'అప్పుల్డి', తప్పుల్డి, రొప్పుల్డి కూడా అన్నాడటీతడు.

**మావాడు వట్టి "లండు" అన్నాడటాతడు.**
మీ వాడే నయం, మా వాడు "బండు" కూడా అన్నాడటీతడు.

**మా వాడు వట్టి అవధాని అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు వట్టి ధ్వని అన్నాడటీతడు.

**మా ఆవిడ వంటకు ప్రసిద్ధి అన్నాడటాతడు.**
మీ ఆవిడే నయం, మా ఆవిడ తంటకు అన్నాడటీతడు.

**పొద్దస్తమానం "నేను", "నేను" అంటాడు మా వాడు అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు "నేనే", "నేనే" అంటాడన్నాడటీతడు.

**మాది అదేపనిగా 'అలుగుల్డి' అన్నాడటాతడు**
మీదే నయం, మాది అస్తమానం 'గులుగుల్డి', 'సణుగుల్డి' కూడా అన్నాడటీతడు.

**మాది ప్రతిదానికీ 'ఒప్పుల్డి' అన్నాడటాతడు**
మీదే నయం, మాది ప్రతిదానికీ 'రొప్పుల్డి' కూడా అన్నాడటీతడు.

**మాది ప్రతి దానికీ తప్పుల్డి అన్నాడటాతడు**
మీదే నయం, మాది ప్రతి దానికీ దెప్పుల్డి కూడా అన్నాడటీతడు.

**మాది అన్నీ అట్టే చెప్పేస్తుందన్నాడటాతడు**
మీదే నయం, మాది అన్నీ అట్టే ఒప్పేస్తుందన్నాడటీతడు.

**మావాడు పక్కా "లంగా" అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు దొంగ కూడా అన్నాడటీతడు.

**మా వాడు పట్టి పండితుడు అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు పచ్చి సుండితుడు కూడా అన్నాడటీతడు.

**మాది పట్టి మూలకు పడ్డ ముసల్ది అన్నాడటాతడు**
మీదే నయం, మా ఇంట్లో అదే ఇంకా అసల్ది మా పీకల్ది అన్నాడటీతడు.

**అతడు చాలా మోటు అన్నాడటాతడు**
అతడే నయం, ఇతడు మోటుతోపాటు సాపాటు అన్నాడటీతడు.

**మా ఆవిడ 'తిరుగాడి' అన్నాడటాతడు**
మీ ఆవిడే నయం, మా ఆవిడ మెరుగాడి కూడా అన్నాడటీతడు.

**మా వాడు మొండి అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు తేలుకొండి అన్నాడటీతడు.

**మా ఆవిడ పండితురాలు అన్నాడటాతడు**
మీ ఆవిడే నయం, మా ఆవిడ పిండితురాలు అన్నాడటీతడు.

**మా వాడు మోసగాడు అన్నాడటాతడు**
మీ వాడే నయం, మా వాడు సీసగాడు కూడా అన్నాడటీతడు.

**మీ ఆవిడ వంట బాగా చేస్తుందట గదా? అన్నాడటాతడు**
అందుకే కదా ఎప్పటికీ పొయ్యిఆరదని నా మంట అన్నాడటీతడు.

**మీ ఇంట్లో ఏది అరుగు, ఏది మరుగు అన్నాడటాతడు**
అరుగు లేదు, మరుగు లేదు, అంతా మురుగే అన్నాడటీతడు.

**మీ ఇంట్లో రామాయణం జరుగుతుందా భారతమా? అన్నాడటాతడు**
ఎప్పుడూ భారతమే, ఎప్పుడో ఒకపుడు రామాయణం అన్నాడటీతడు.

**ఏమిటి అలా చూస్తున్నావు అందిట ఆవిడ, తదేకంగా తనవైపే చూచే ఒకతనితో.**
**సొమ్ములు (రొమ్ములు) బాగుంటే అన్నాడటాతడు.**
వస్తాడు ఆగు, నా మగడు తీస్తాడు నీ దమ్ములు అందిటావిడ.

**మా ఇంట్లో తెగ ఆరాటాలు అన్నాడట ఆతడు**
మీ ఇల్లే నయం, మా ఇంట్లో తెగ పోరాటాలు అన్నాడటీతడు.

**మాది వట్టి 'కొప్పుల్ది' అన్నాడటాతడు**
మీదే నయం, మాది 'దప్పుల్ది' కూడా అన్నాడటీతడు.

**మాది వట్టి "పెబ్బెల్ది" (గొప్పలు చెప్పుకోవడం) అన్నాడటాతడు**
మీదే నయం, మాది ప్రతిదానికీ "రుబ్బుల్ది" కూడా అన్నాడటీతడు.

**మాది వట్టి "వాదుల్ది" అన్నాడటాతడు**
మీదే నయం, మాది 'బాదుల్ది' కూడాఅన్నాడటీతడు.

మావాడు 'మీసాల' రాయుడన్నాడటాతడు.
మీ వాడే నయం, మావాడు మోసాల, సీసాలరాయుడు కూడా అన్నాడటీతడు.

మాదెప్పటికీ ఓ మెట్టెక్కి మాట్లాడతుందన్నాడటాతడు
మీదే నయం, మాది చెట్టెక్కి అన్నాడటీతడు.

మాదానికి ప్రతీదీ గొట్టే అన్నాడటాతడు
మీదే నయం, మాదానికి ప్రతీదీ ముట్టేనన్నాడటీతడు.

మాది అదే పనిగా అందరితో మాట్లాడుతుందన్నాడటాతడు
మీదే నయం, మాది అందరితో అదే పనిగా పోట్లాడుతుందన్నాడటీతడు.

మాది 'రంకుల్ది' అన్నాడటాతడు.
మీదే నయం, మాది 'బొంకుల్ది', 'మంకుల్ది' కూడా అన్నాడటీతడు.

మాది వట్టి 'పగల'దన్నాడటాతడు.
మీదే నయం, మాది అదే పనిగా 'నగల్ది' అన్నాడటీతడు.

**మాది వట్టి 'తిండిపోతు' అన్నాడటాతడు**
మీదే నయం, మాది 'మండిపోతు' కూడా అన్నాడటీతడు.

మా బియ్యంలో అన్నీ రాళ్ళే అన్నాడటాతడు.
మీవే నయం, మావి రాళ్ళల్లోనే బియ్యం అన్నాడటీతడు.

మా పాలల్లో అన్నీ నీళ్ళే ? అన్నాడటాతడు.
మీవే నయం, మావి నీళ్ళల్లోనే పాలు అన్నాడటీతడు.



**ఈసారి పంటలు తక్కువ పండాయన్నాడట వంటవానితో యజమాని**
**అది నా అదృష్టం సార్ అన్నాడట వంటవాడు.**
ఎందుకన్నాడట యజమాని
ఇక నా వంటలు తక్కువే కదా సార్! అన్నాడట వంటవాడు.

**నాకు ఒక మంచి అద్దె ఇల్లు చూడవయ్యా అన్నాడట ఒక బంట్రోతుతో ఒక యజమాని.**
ఒకటుంది సార్! రూఫొక్కటే లేదు కాని ఇల్లంటే ఇల్లా! మీరు సరేనంటే నొక్కుతాను ఆ ఇంటి 'బెల్లు', మనకే అది 'చెల్లు' అన్నాడటాబంట్రోతు.

**'స్టేట్' అంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
అపుడేమిటో కాని, ఇప్పుడు మాత్రం ఒక "ఎస్టేట్', పరిపాలకులు ఎంతంటే అంత దండుకోవడానికి ఒపెన్‌గేట్ అన్నాడట విద్యార్థి.
భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.

**'సిద్ధాంత'మంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
మా సార్లల్లో రోజూ అదే పనిగా సాగే అదొక ఎడతెగని రాద్ధంతం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'ఫెడరేషన్' అంటే ఏమిటని అడగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
ఊళ్లుల్లు మూట కట్టు లాంటి ఒక రాష్ట్రాల పడికట్టు అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'నాగరికత' అంటే ఏమిటని అడగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
నగరీకతకు దీర్ఘం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'సెక్యులరిజం' అంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
ఇంట్లో 'కమ్యూనలిజం', బైట "కాస్మోపోలిటనిజం" బోధించే Opportunism అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'సోషలిజమంటే' ఏమిటని అడగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
తనది కానిది తనదనుకునే మిథ్యాభావం, ఎండమావి భావం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'రాజ్యాంగం' అంటే ఏమిటని అడగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
అది అట్ట ఒక్కటి తప్ప అసలు పోల్చుకోజాలని అనేకానేక మార్పులకు గురయిన ఆదర్శాల,

ఆశయాల గుట్ట, పుట్ట, చిట్టా అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'ప్లానింగ్' అంటే ఏమిటని అడిగాడట  ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
Measure తప్ప Treasure లేక ఊగుతూ సాగుతూ అదేదో జరుగుతుందనుకునే అదొక పరిపాలకుల డ్రీమింగ్ స్కీమింగ్ అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**ఒకప్పటి 'రాచరికానికి' ఇప్పటి 'ప్రజాస్వామ్యానికి' తేడా ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
'పేర్ల'లోనే తేడా కాని 'షేర్ల'లో, 'గీర్ల'లో (లాగుడు) తేడా లేదన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'అవినీతి' అంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
'అది' 'ఇది' అని విచక్షణ లేకుండా అంతటా అందరి వద్దా వారి వారి అత్యవసరాలను బట్టి వసూలు చేసికొనే అదొక నీతి, రీతి అన్నాడట  విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'సంస్కారమంటే' ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
అప్పుడేమిటో కాని ఇప్పుడు మాత్రం అదొక సారం లేని బేరం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**'ఎంబిఏ' అంటే ఏమిటి అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థిని.**
సి.ఇ.ఓ కాకపూర్వమే సి.ఇ.ఓ అయినంత, పట్టా రాక పూర్వమే పట్టా వచ్చినంత వెలితి పడే అదొక మిథ్య లాంటి విద్య అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**వామపక్షాలవారంటే ఎవరన్నారట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఇంట్లో "అమీర్లలా" బ్రతికి, బైట "గరీబుల" గురించి అదే పనిగా మాట్లాడేవారన్నాడట విద్యార్థి.
భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.

**ప్రిన్సిపాల్ అంటే ఎవరన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అపుడేమోకాని ఇపుడుమాత్రం మా పాల్ (Pal) లాంటి సార్లకు ప్రిన్స్ అన్నాడట విద్యార్థి.
భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.

**హెడ్‌మాస్టార్ అంటే ఎవరన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అపుడేమోకాని ఇపుడుమాత్రం హెడ్లు లేని సార్లకు ఆతడే అహెడ్ అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**మధురానికి మథిరానికి తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
మొదటిది 'వాగుబోతు'కు చెందింది, రెండవది 'త్రాగుబోతు' కు అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**రిజర్వేషన్ అంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఫ్యూచర్ డిజర్వేషన్‌కు ఇపుడు కల్పించే ప్రిజర్వేషన్ అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**టీచర్ అంటే ఎవరు అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అపుడేమోకాని ఇపుడుమాత్రం పట్టుకుంటే విడవని లీచర్, బ్లీచర్ అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**పల్లెటూరు బాగా, పట్టణం బాగా? అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అచటున్నప్పుడు అది, ఇచటున్నప్పుడు ఇది అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**గురువంటే ఎవ్వరు అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అప్పుడేవరో కాని, ఇపుడు మాత్రం విద్యార్థుల పాలిటి విద్యా కరువు, బరువు, అర్థంకాని అచ్చెరువు అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**జ్ఞానానికి ధ్యానానికి తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
జ్ఞానం బ్రతకడడానికి, ధ్యానం వెదకడానికి చెందింది అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**మనిషికి మానవునికి తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఆకారానికి ఆత్మకున్న తేడా అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**లక్ష్మికి సర్వస్వతికి తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
లక్కుకు, బుక్కుకున్న తేడా అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్! అన్నాడట పర్యవేక్షకుడు.**

**అతిశయోక్తంటే ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
బ్రతుకు దెరువు కొరకు బ్రతుకుదెరువు కలవానికి కొట్టే బాక, పట్టేకాక అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**సిద్ధాంతి అంటే ఎవ్వరు అన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
అనుకున్నది సిద్ధించే వరకు విడవని రాద్ధాంతి అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**'నాగరీకతకీ' 'నగరీకతకీ' తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో**
'అచ్చ బంగారానికి' కేటు 'బంగారానికి' ఉండే తేడా అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**'ఇంగ్లండ్ -ఇంగ్లీషుకి', 'ఇండియన్ - ఇంగ్లీష్‌కి' తేడా ఏమిటన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో**
'మేన్‌కి', 'సబ్సిడియరీకి' ఉన్న తేడా అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**ఇండియాకు, "ఇండియా" అనే ఎందుకు పేరు పెట్టారన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఇంకొకటి పెడితే, ఇంటిల్లి పాదీ అదంటే ఇది, ఇదంటే అది అని పోట్లాడతారని అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**"బహురూపులవాళ్ళు" అంటే ఎవరు అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఒకప్పటి వారు నాకు తెలుసు, కాని ఇప్పటివారి గురించి ఎవరైనా రాజకీయులతో అడిగి తెలుసుకోవడం మంచిది అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**కల్చర్ అంటే ఏమిటి అన్నాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఒకప్పుడీ దేశంలో ఇంటింటా అదే మొదటిది, ఇపుడు మాత్రం అదే ఆఖరుది అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**విశ్వవిద్యాలయాలంటే ఏమిటి అని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
ఒకప్పుడేమిటో కాని, ఇపుడు మాత్రం ఎడతెగని విచ్చలవిడులకు, వియ్యాల వేటగాళ్ళకు అదొక నిలయం, వినోదాలయం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**సచివాలయమంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
రూల్సెక్కువ, రూలింగ్‌లు తక్కువ, పరిపాలకులెక్కువ పరిపాలనలు తక్కువకు నిలయం అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.

**విలువలంటే ఏమిటని అడిగాడట ఒక పర్యవేక్షకుడు ఒక విద్యార్థితో.**
విలువైనవే కాని వీలు కానివని, వదిలేసేటివి అన్నాడట విద్యార్థి.
**భేష్! భేష్!** అన్నాడట పర్యవేక్షకుడు.





Dr. V. Kondal Rao is basically an educationist, known for his pioneering mind and promotinal drive and initiative. He has been the Principal and architect of many higher educational institutions in Andhra Pradesh.

The last and the last but one positions that he held in the State of Andhra Pradesh were Director, Telugu Academy and Joint Director, Higher Education.

Left an indelible mark wherever he worked, whatever positions he held.

Dr. Rao is an educationist by profession, a poet by vocation. He writes and translates in English, Urdu, Hindi and Telugu. Has to his credit many original works and translations which are widely read, admired and appreciated.

He is a member of the Poetry Society of India and Poetry Society of Hyderabad.

Has been awarded the best translation award from Telugu University, A.P.

Is the recipient of Honorary Doctorate, D.litt. from the Telugu University, A.P. and the World Academy of Arts and Culture, California. The recipient of Michael Madhusudhan Dutt Award, Calcutta.

Attended International Poets Meets held at Bangkok and Istanbul. Visited U.S.A., U.K., Japan, Turkey, Thailand and Singapur.

He is a freelance writer, whose forte is depth of thought, keen observation, absorption and penetration. He has a very keen eye for men and matters.

He has to his credit 20 books, authored, translated and edited in English, Telugu, Urdu and Hindi.

Former Vice President, Poetry Society of Hyderabad.

Presently, Hon. Chairman, Viswanatha Sahitya Peetham, A.P., Vice-Chairman, Forum for Higher Education, Hyderabad.

Life Member, Indian Instt. of Public Admn., Delhi.

Founder Editor of Business Vision, a business and management quarterly journal.

Founder Editor of JAYANTHI, a literary quarterly journal.

Dr.Rao hails from Karimnagar district of Andhra Pradesh, India.

Born in 21st July 1932. Married to V. Nirmala. Blessed with one Son and two daughters. Resides at 215, My Home Madhuban Apartments Srinagar Colony, Hyderabad, A.P. India, Pin: 500 073.
Can be contacted on Ph. 23396358, 9848195959,
E-mail: vkrao@sncps.com, krvelchala2012@gmail.com.